# లక్షాధికారి

(సాంఘిక నాటకం)

రచన:

శ్రీ సీతంరాజు వెంకటేశ్వరరావు...

పబ్లిషర్సు

చంద్రా పబ్లికేషన్స్

విజయవాడ-1

ప్రథమ ముద్రణ జూలై 1959
ప్రతులు 1000

**వెల: 1-50**

ముద్రణ:
శ్రీ సరస్వతీ ప్రెస్,
విజయవాడ-1

# ఒక మాట!

నన్ను నేను పొగడుకోటానికి, నాగురించి మీకు తెలియపర్చటానికే కాదు యీ ముందుమాట! యింతవరకూ నన్ను ప్రోత్సహించి ప్రోత్సహిస్తున్న నాటకసంస్థలవారికి ప్రచురణ



కర్తలకు తదితర మిత్రులకూ అభివందనాలు అందచేస్తూ తెలియపరుస్తున్న ఒకమాట యేమిటంటే యీ నాటకం 1958 జనవరి మాసంలో వ్రాతప్రతిని పూర్తిచేశాను. అనివార్యకారణాల వలన అచ్చుకావటంలో ఆలశ్యం జరిగినా వ్రాతప్రతుల ఆధారంతో ఒక ప్రదర్శనం జరుపుకుంది. ఆనాటి రాత్రే వ్రాతప్రతిని ఎవరో చల్లగా సంగ్రహించారు. కొందరు మిత్రులు పాడుకోవాలని అభిలాష చూపిన మీదట యిందు లోని పాటలుకూడ విడిగా వ్రాసియిచ్చాను. అంచేత పోయిన వ్రాతప్రతిని చిక్కించుకున్నవారుగాని, విడిగాపాటలు వ్రాయించుకున్న వారుగాని, యేవిధమైన అన్యాక్రాంతాలు జరిపివుండరని తలుస్తా! యీ నాటకంలో ఏమైనాలోట్లువుంటే దయతో తెలియపరుస్తే ముందుముద్రణలో సరిదిద్దుకుంటా!

అభివందనాలతో

సీతంరాజు (రచయిత)

## మనవి—

ప్రదర్శనం జయప్రదంగా జరపాలంటే, సీనుసీనుకీమధ్య వ్యవధి లేకుండా ప్రదర్శించుకోవాలంటే మూడు తెరలు యేర్పాటు చేసుకోవాలి! మొదటి రెండు తెరల మధ్యనా వీధి గాను, తర్వాత రెండు తెరల మధ్యనా యిల్లుగానూ వాడుకోవాలి! పాత్రలు కంఠస్తంచేసి, అర్థంచేసుకొని నటించటం యంతైనా అవసరం! దయతో పుస్తకంలో ప్రచురించిన పాటలు పద్యాలు మినహా యితరత్రా యేవిధమైన పాటలు, పద్యాలు చేర్చకుండా వుంటారని ఆశిస్తా

## సూచన—

ఈ నాటకానికి సంబంధించిన ప్రదర్శన హక్కులు మాత్రం నాకు చెందియున్నవి. లిఖిత పూర్వకమైన అనుమతి పొందకుండా ప్రదర్శించరాదు.

సత్యనారాయణపురం
విజయవాడ-2

ఇట్లు, మీ
సీతంరాజు (రచయిత)

# వచ్చేవేషాలు

| | |
|---|---|
| దామోదరం | [వయస్సు 45 సం॥ లు] |
| చలమయ్య | [ 45 సం॥ లు] |
| మధు | [ 25 సం॥ లు] |
| నారాయణ | [ 25 సం॥ లు] |
| మిస్టర్ ఛిమ్ ఛిమ్ | [ 25 సం॥ లు] |
| ప్రకాశం | [ 25 సం॥ లు] |
| శరభయ్య | [ 35 సం॥ లు] |
| పోలయ్య | [ 35 సం॥ లు] |
| రాధ | [ 18 సం॥ లు] |
| సుధ | [ 18 సం॥ లు] |

# ప్రార్థన

జయహో! జయహో!! జయహో!!!
కళామ తల్లికి జయహో జయహో!!! ||జయ||

కళారాధనకు నడుంకట్టితిమిటు
కళామతల్లీ కానుకగ
సమర్పింతుము మాశక్తి
దీవించుము మము ఓజననీ ||జయ||

పావనమైన భారత భూమిపై
కళాకారులకు కన్నతల్లివై
కల్పవృక్షముగ కాపాడుటకై
కదలి రావమ్మా కళామతల్లీ ||జయ||

జయముకై మేము జయభేరి మ్రోగించి
జయజయ ధ్వానులతో విజయశంఖంపూది
కర్పూర హారతులె నీకొసంగితిమి
కరుణించి కాపాడు కన్నతల్లీ మమ్ము ||జయ||

# లక్షాధికారి

## 1 వ రంగం

అది దామోదరం యింట్లోగది. అటూ యిటూ గుమ్మాలు కుడివేపున గుమ్మానికి పూసలతోరణం కర్టను, ఎదురుగోడకేసి కిటికీ, కిటికీ ప్రక్కనే గుడ్డలు తగిలించుకొనే బంకె, కిటికీకిపైభాగంలో వెంకటేశ్వరస్వామి, రాముడు, కృష్ణుడు, లక్ష్మి వగైరా దేముళ్ళఫొటోలు. కనిపిస్తుంటాయ్. గదిలో కుడివేపుం కాళ్ళు పెట్టుకోటానికి వీలయ్యే పడకకుర్చీ, ప్రక్కనే ఎత్తుకోళ్ళ కుర్చీపీట, దానిమీద రెండుమూడుపుస్తకాలు, ఎదురుగోడకు. కిటికీకి క్రిందభాగంలో గోడకు ఎత్తబడి వున్న నవ్వారుమంచం తెరలేచేసరికి కనిపిస్తూంటాయ్.

దామోదరం – (మాసినగడ్డం, కళ్ళకు మసకజోడు, చేతిలో వంకికర్రపట్టుకొని లోపలనుంచి విసురుగావస్తాడు. చేతులబనీను, బిళ్ళగోచీ కట్టువంచ) సవ్వాశేరు చింతపండు కొని రెండుమాసాలు కాలేదు! అప్పుడే అయిపో తుందా? ఎందుకయిపోదు? వాడుతూవుంటే అయి పోకవుంటుందా? ఆ వాడటం జాగ్రత్తగా వాడకర్లా? మనం మాసం పూర్తిఅయ్యేవరకూ చింతగింజకూడా ముట్టుకోను! (లోపలకుచూస్తూ) ఏమహారిస్తావో

ఆహారించు! (పడకకుర్చీలో కూర్చొని మీసం సవరించుకుంటూ గర్వంగా) యిష్టంవచ్చినట్లు దుబారా ఖర్చు చేస్తానంటే వప్పుకునేటంత వెర్రిఘటం కాదు యీదామోదరం! (గర్వంతో సకిలించి ప్రక్కన పీట మీదున్న జమాఖర్చుల పుస్తకంతీసి పేజీలు తిరగేస్తాడు. లోపలకుచూస్తూ) ఇదిగో! శరభయ్యా! (శరభయ్య లోపలనుంచి 'బాబూ' అంటూవస్తాడు) మళ్ళీ సరుకులు తెచ్చేవరకూ చింతపండుకి బదులు నిమ్మకాయలుకోసి వాడుతుండు! రోజుకొక చెక్క చొప్పునేసుమా! ఎక్కువవాడావా నాకు కోపం వస్తుంది! చెట్లనున్న కాయలు యింతకుముందే లెక్క పెట్టాను. మొత్తం నూటపదకొండు కాయలున్నాయ్! జాగ్రత్త! (మీసం సవరించుకుంటాడు. శరభయ్య నెమ్మదిగా లోపలకు వెడతాడు పుస్తకంలోచూస్తూ) ఆరు మూడు తొమ్మిది, తొమ్మిదీ పదహారు ఇరవై అయిదు, యిరవైఆరు, యిరవై ఎనిమిదిన్నర, ముప్పై రెండూ రెండణాలు! [లోపలనుంచి రాధవచ్చి దామోదరం పైకి చదువుతున్న కూడికవిని వస్తున్న నవ్వుని ఆపుకుంటుంది] వంటమనిషి జీతం పదిరూపాయలతో సహా నలభై రెండూ రెండణాలు! [పైకిచూస్తు] క్రిందటి నెలఖర్చుకంటే రెండణాలు యెక్కువే అయింది.

రాధ - [హేళనగా] ఎంతజాగ్రత్తగా ఖర్చుపెడుతున్నా యెక్కడికక్కడే మామయ్యకు అనుమానం! రెండ

ణాలుకదా యెక్కువైంది! అది యేమంత పెద్దమొత్తమని ఆలోచన?

దా - దమ్మిడీ యెక్కువైనా యెక్కువ యెక్కువే! నీకేం నువ్వు నవ్వుతావ్! ఎంతకష్టపడి చమటోడిస్తే ఆరెండు అణాలుపసాయో తెలిశుంటేగా! (వెటకారంగా) ప్రతిదానికీ వళ్ళికిలించమంటే యికిలిస్తావ్!

రా కాదుమామయ్యా! యీనెలలో బేడకదా యెక్కువైంది! బేడకుబేడ పావలా వచ్చేనెలఖర్చులో తగ్గిస్తే తీరిపోలా? దానికీ పెద్దఆలోచనెందుకు?

దా - (నవ్వి ప్రేమగా ) ఆమాటన్నావ్ నాకునచ్చింది!

రా - ఏదో జీతం యేర్పాటుచేస్తే యిలాగే సలహాలు యిస్తూంటానుగా!

దా - (నిట్టూర్చి) అవుతున్నదండగ చాలకనా?

నారాయణ - (బయటనుంచి వస్తునే) మామయ్యా యేదో దండగ పెట్టేస్తున్నాడే?

దా - నాదండగమాటెలాగున్నా రేపు నీచెల్లెలు హాయాం వచ్చాకనిత్యంవండగచేశేటట్లుంది! (రాధనుచూస్తూను)

రా - (ఛలోక్తిగా) మన ధర్మమాంటూ పదిమంది బ్రతుకుతారు! (నారాయణనిచూస్తు) ఏమంటావన్నయ్యా!

నా - తప్పకుండాను!

దా - (ఆశ్చర్యంగా) ఏమన్నావ్!

నా - అది సహజమే మామయ్యా! పెద్దవాళ్ళు వట్టిదు మెతుకులన్నా గట్టిగా తినకుండా మూటకడితే చిన్నవాళ్ళు వాళ్ళ హయాములో మూటకట్టినది మురిగిపోకుండా వాడేస్తారు!

రా - (చిన్నగా నవ్వి) బలేగాఅన్నావ్ అన్నయ్యా! (శరభయ్య పాలగ్లాసు తీసుకొని లోపలనుంచివస్తాడు. రాధ అందుకుంటుంది శరభయ్య లోపలకు వెడతాడు)

దా - (నారాయణనిచూసి) బాగాసెప్పుంది వ్యవహారం! (రాధ అందిస్తున్న పాలగ్లాసు అందుకని) అన్నయ్య వంత పాడటం, చెల్లెమ్మ తాళంవేయటం! మీయిద్దరికీ తగ్గవాడే మామయ్య! (పాలు త్రాగుతాడు రాధ నారాయణలు నవ్వుతారు. ఖాళీగ్లాసు తిరిగి రాధకుయిస్తూ) ఇదిగో నారాయణా! పొలం వెడుతున్నావ్ గాందు! మా పడమర పొలం తడుపుతున్నారు అటొకసారి అడుగేసి చూసిరా! (నారాయణ సరే నన్నట్టు తలవంకిస్తాడు. దామోదరం అదోలా రాధనుచూస్తు) గ్లాసుతీసుకోవేమే భడవా!

రా — ఓ! (చిన్నగా నవ్వి గ్లాసు అందుకుంటుంది) పంచదార సరిపోయిందా మామయ్యా!

దా — ఇచ్చింది కోడలా మహాతల్లా?

రా — (అదోలా) పాలు కలిపింది శరభయ్యా!

నా — (దామోదరంనిచూస్తు రాధతో హేళనగా) ఇచ్చింది నీచేత్తోగా!

రా — (దామోదరాన్ని చూస్తు నారాయణతో) ముందు తెలిస్తే పంచదార అసలే వేయవద్దనేదాన్ని! (నవ్వుతుంది)

దా — ఆ! (నిట్టూర్చి నారాయణతో) కొందర్లో ముడిపెట్టక పోతే లాభంలేదు నారాయణా!

రా — (అర్థంకానట్టు) ఎవరికి?

దా — నీకే! (బయటనుంచి చలమయ్య వస్తాడు)

రా — (నిట్టూర్చి) నాకా! ఎవరినన్నా చూసి నువ్వే ముడిపెట్టేస్తావేమోననుకుంటున్నాను! (నారాయణ, చలమయ్యలు నవ్వుతారు)

దా — ఆమాటకొచ్చినా కొడుకైతేనేం తండ్రయితేనేం! నాకూ వరుసేగా! యిష్టమైతే ఆముడి నాచేతనే వేయించుకో!

చల — (నవ్వి) నారాయణ పప్పుకోవద్దూ?

నా - నాసంగతటుంచినా మరి వప్పుకుంటాడా?

దా - వాడు సరేనన్నా రాధ...

రా - (సిగ్గుతో) ఫో మామయ్యా! (తల వంచుకుంటుంది)

చ - పెళ్ళనేసరికి తన్నాదియ్యా ఆసిగ్గు ఎక్కణ్ణుంచి వస్తుందో యేమో! యిట్టే తలవంచేస్తారు! (అంతా నవ్వుతారు రాధ మరీ సిగ్గుతో లోపలకు వెళుతుంది)

నా - నేవెళ్ళొస్తాను మామయ్యా!

దా - మర్చిపోకుండా నూహాలంకూడా చూసిరాసుమా! (నారాయణ సరే నన్నట్లు తలవంకించి బయటికి వెడతాడు) నారాయణ మనస్సు చాలామంచిది!

చ - (వెటకారంగా) అవునవును! చాలామంచిమనస్సు! [నవ్వుతాడు]

దా - (యేదోగుర్తు కొచ్చినట్లుచూస్తు) ఆప్రకాశం బాకీ వసూలు కానట్లేనా? నీకు వాడికీ పేచీవుంటే నాబాకీ చెల్లించటానికేం?

చ - అదేనాకూ అర్థంకావటల్లేదు! వాడంత మొండిఘటాన్ని యెక్కడాచూళ్ళేదు! నువ్వు పిలవనంపావని మీా పాలేరుద్వారా కబురుచేశాను! బహుశా యివ్వాళో కాళ్ళో పటికో రావచ్చు. అదేదో గట్టిగాఅడిగి నువ్వేతేల్చుకో టంమంచిది!

దా - అసలేమంటాడు? (రాధ లోపలనుంచి వస్తుంది)

చ - ఎంతమందిచేత అడిగించినా సరైన జవాబివ్వండేనా!

శరభయ్య - [లోపలనుంచి వస్తూనే] బాబూ! యీ పూట
కూరేం చెయ్యమంటారు?

దా - వ్యవహారం గురించి మాట్లాడేటప్పుడు మధ్యలో యిటు
వంటి ప్రశ్నలు వేయవద్దని యెన్నిసార్లో చెప్పాను

శ - అదికాదు బాబూ! యీపూట .....

దా - ఏమీలేకపోతే పాతచింతకాయ పచ్చడి వుంది నేవుంది!

రా - [ఆశ్చర్యంగా] మూడేళ్ళనాటిదా?

చ - పదేళ్ళనాటిదైనా ఫరవాలేదు! సొమ్ము చేదా? పనికిరా
దని పారేసుకుంటామా? [దామోదరంని చూస్తాడు.
దామోదరం అవునన్నట్లు తల ఆడిస్తాడు]

రా - [నిట్టూర్చి శరభయ్యతో] బుట్టలో యేంకూరలు
న్నాయ్?

శ - ఏమీలేవమ్మా!

రా - చట్లని?

దా - అరటి కాయలున్నాయ్!

రా - [దామోదరంతో] వాటిని అలాగేవుంచేద్దాం! [నవ్వి శరభయ్యతో] మామయ్యకు యిష్టమైన పదార్థాలు నేను చెప్తాను! అవి చెయ్!

దా - ఊం! కాబోయే కోడలివి! యేదో చేయించు!

రా - పలుగురాయి పచ్చడి, ఇటుకరాయి యిగురు చేయిస్తే?

చ - [అదోలాచూస్తు చిన్నగానవ్వి] మొత్తానికి అసాధ్యురాలే!

దా - చెప్పిందిగా! [శరభయ్యతో] ఆ రెండూచేసి ముందు దానికిపెట్టు! దీనివళ్ళు యెంతగట్టిపడ్డాయో చూసి తర్వాత... ..

చ - [హేళనగా] దామోదరంకూడా తింటాడు!

దా - ఆ! అంతవరకూవస్తే నిన్నువదుల్తానా?

శ - పొయ్యూరికే పోతోంది బాబూ!

రా - [హేళనగా] పోకుండా చంకనెట్టుకు రాకపోయావ్! [నవ్వుతుంది]

దా - పోయి ఆకూరల సంగతేదో చూసిరావే! తర్వాత వళ్ళుకిలిద్దువుగాని! [రాధ, శరభయ్య లోపలకు వెడతారు. బయటనుంచి పోలయ్య వస్తాడు]

పోలయ్య - నాయుళ్ళోనమన్నారంట! తనకు యెంటచేవత్తే సవక బేరానికి యిప్పిత్తానని పెదరామయగోరు శెప్పిర మన్నారుదొరా!

దా - ఏమాత్రం వుందన్నాడు?

చ - ఏమాత్రమున్నా చవకబేరం చెయిజారితేయెలా? పోయొద్దాం పద!

దా - [సరేనన్నట్టు తలపంకించి] పోలయ్యా! ఆపార్వతమ్మనడిగి పాలబాకీ వసూలుచేసుకురా! [పోలయ్య బయటకు వెడతాడు] పద పోయొద్దాం! [పైన తుండు వేసుకొని లేస్తాడు]

రా - [లోపలనుంచి వస్తూనే] ఎక్కడికి మామయ్యా!

దా - [ఆగి] అడిగావ్! [నిట్టూర్చి] వెళ్ళినపని అయినట్టే! [చలమయ్యనుచూస్తూ] రెండు నిముషాలు కూర్చుని పోదాం! [కూర్చుంటాడు]

రా - అంత పెద్దపనేమిటో!

దా - నీపెళ్ళికి ముహూర్తం పెట్టించటానికి!

రా - [సిగ్గుతో] పో మామయ్య! నువ్వెప్పుడూయింతే! (లోపలకి వెడుతుంది)

ప్రకాశం - (బయటనుంచి) దామోదరంగారూ!

చ - ప్రకాశం వచ్చినట్లున్నాడు. కొంచెం కటువుగా మాట్లాడి తేనేగానీ బాకీ కక్కడు! జాగ్రత్త!

ప్ర - (లోపలకువచ్చి) నమస్కారమండీ! (చలమయ్యను ప్రక్కగాచూస్తూ దామోదరంతో) ఎందుకు పిలిపించారుట.

దా - మా బాకీ మాటేంచెప్పావ్?

ప్ర - తాకట్టుక్రింద వస్తువులున్నాయిగా!

దా - ఎందుకా యిత్తడిముక్కలు?

ప్ర - ఇత్తడిముక్కలో, యినప ముక్కలో చూపించే పెట్టాను!

చ - బాకీతీర్చి నీవస్తువులు నీవు తీసుకుపోవాలిగాని, అతిగా జవాబుచెప్పి అవతల మనిషికి కోపం తెప్పించకు ప్రకాశం!

ప్ర - (చలమయ్యవేపు రెండడుగులు వేసికోవంగా) చాలూరుకోవయ్యా! ఎవరు కోపం తెప్పించేది? ఆరోజున గీటు రాతిమీద బాగా అరగతీసి మరీ పెట్టుకున్నారుగా తాకట్టు! అవ్వాళ బంగారంలావున్న వస్తువులు యివ్వాళ యిత్తడిముక్కలుగా కనుపించాయేం? మాట్లాడే మాటల్లో అర్థంవుండాలి! వస్తువులు వుంచుకుంది కాకుండా వడ్డీ తీసుకుంటూ......

దా – (కోపంతో) వడ్డీ నువ్వేయిస్తున్నావా? అవసరానికి అడ్డున్నప్పుడు యెవరికోసం యిస్తావ్? తెలిసున్నవాడి వని, యిబ్బందిలో వున్నావని కనికరించి......

ప్ర – (వెటకారంగా) ఆకట్టుమీద రూపాయకు బేడ తీసుకుంటున్నారు! అంతేనా? (స్థాయితగ్గించి) కాబూలి వాడికంటే కనాకష్టం.

చ – ఇష్టమై పెట్టినప్పుడు యిలామాట్లాడటం తప్పు.

ప్ర – ఆమాటే నేనూ అంటున్నా! యిష్టమై పెట్టించుకున్నప్పుడు యిలామాట్లాడటం తప్పని.

దా – తప్పో వొప్పో మాకురావలసింది దమ్మిడీలతోసహా మాకిచ్చి నీవస్తువులు నువ్వుతీసుకుపో!

ప్ర – రావలసిన పైకం రానీయండి!

చ – ఎంత కాలానికి వస్తుంది?

ప్ర – ఇంతకాలానికి వస్తుందని చెప్పటానికి నేనేం జ్యోతిష్యుణ్ణా?

దా – అదేనా యివ్వాల్సినజవాబు?

ప్ర – కాకపోతే మధ్య ఆయనకెందుకు?

చ – అడ్డంవుండి యిప్పించినందుకు!

చ - ప్రకాశం వచ్చినట్లున్నాడు. కొంచెం కటువుగా మాట్లాడితేనేగానీ బాకీ కక్కడు! జాగ్రత్త!

ప్ర - (లోపలకువచ్చి) నమస్కారమండీ! (చలమయ్యను ప్రక్కగా చూస్తూ దామోదరంతో) ఎందుకు పిలిపించారుట.

దా - మా బాకీ మాటేంచెప్పావ్?

ప్ర - తాకట్టుక్రింద వస్తువులున్నాయిగా!

దా - ఎందుకా యిత్తడిముక్కలు?

ప్ర - ఇత్తడిముక్కలో, యినపముక్కలో చూపించే పెట్టాను!

చ - బాకీతీర్చి నీవస్తువులు నీవు తీసుకుపోవాలిగాని, అతిగా జవాబుచెప్పి అవతల మనిషికి కోపం తెప్పించకు ప్రకాశం!

ప్ర - (చలమయ్యవేపు రెండడుగులు వేసికోపంగా) చాలూరుకోవయ్యా! ఎవరు కోపం తెప్పించేది? ఆరోజున గీటు రాతిమీద బాగా అరగతీసి మరీ పెట్టుకున్నారుగా తాకట్టు! అవ్వాళ బంగారంలావున్న వస్తువులు యివ్వాళ యిత్తడిముక్కలుగా కనుపించాయేం? మాట్లాడే మాటల్లో అర్థంవుండాలి! వస్తువులు వుంచుకుంది కాకుండా వడ్డీ తీసుకుంటూ......

దా - (కోపంతో) వడ్డీ నువ్వేయిస్తున్నావా? అవసరానికి అడ్డున్నప్పుడు యెవరికోసం యిస్తావ్? తెలిసున్నవాడి వని, యిబ్బందిలో వున్నావని కనికరించి......

ప్ర - (వెటకారంగా) తాకట్టుమీద రూపాయకు బేడ తీసుకుంటున్నారు! అంతేనా? (స్వరంతగ్గించి) కాబూలివాడికంటే కనాకష్టం.

చ - ఇష్టమై పెట్టినప్పుడు యిలామాట్లాడటం తప్పు.

ప్ర - అవునంటే నేనూ అంటున్నా! యిష్టమై పెట్టించుకున్నప్పుడు యిలామాట్లాడటం తప్పని.

దా - తప్పో వొప్పో మాకురావలసింది దమ్మిడీలతోసహా మాకిచ్చి నీవస్తువులు నువ్వుతీసుకుపో!

ప్ర - రావలసిన పైకం రానీయండి!

చ - ఎంత కాలానికి వస్తుంది?

ప్ర - ఇంతకాలానికి వస్తుందని చెప్పటానికి నేనేం జ్యోతిష్యుణ్ణా?

దా - అదేనా యివ్వాల్సినజవాబు?

ప్ర - కాకపోతే మధ్య ఆయనకెందుకు?

చ - అడ్డంవుండి యిప్పించినందుకు!

దా - ఇవ్వాళా నిన్ననా? యిచ్చి రెండేళ్ళయింది.

ప్ర - తీర్చటానికి మరో రెండేళ్ళు పట్టినా పట్టచ్చు! వస్తువులు
స్నవ్వాడు ..

దా - ఎందుకవి? పెట్టినవస్తువులు కిమ్మత్తుకడితే తీసుకున్న
వెయ్యిరూపాయలకూ అర్యేవడ్డీకి సరిపోదు.

ప్ర - అందుకని ఏమిటి మీ రనేది?

దా - వారంరోజుల్లోగా మాడబ్బు మాకిచ్చి నీవస్తువులు
నువ్వు తీసుకుపోక పోతే......

చ - వాటిమీద నువ్వు ఆశవదులుకోవచ్చు!

ప్ర - (అర్థంకానట్లు) అంటే?

చ - తాకట్టు వాకట్టు అయిపోతుందన్న మాట!

ప్ర - ముయ్యవయ్యా నోరు! నీసొమ్ము కాదనా నోటికొచ్చినట్లు
వాగుతున్నావ్? ఆమాట మళ్ళీఅను చెప్తా?

దా - (కోపంతో) ఏం చేస్తావ్?

ప్ర - బజార్లో నిలబెట్టి అడుగుతాను!

చ - [రోషంతో] అంత మొగాడివా?

ప్ర - మొగాణ్ణో, ఆడదాన్నో అంతవరకూ రానీయండి చెప్తాను
మీ కింకా తెలియదేమో! [మీసం సవరించుకుంటూ]

మాటతేడావస్తే ప్రకాశమంత దుర్మార్గుడు లేడు! తెలిసిందా? హుం! [గబగబా బయటకి వెడతాడు]

దా - [వెళ్ళే ప్రకాశాన్ని చూస్తూ] ఇదిగో! ప్రకాశం! (చలమయ్యతో) మామంచి తాకట్టు దాసుని తీసుకొచ్చావ్ చలమయ్యా!... వ్యాపారం దిన దినానికి దిగజారిపోవటానికి యిలాంటి కాతాలు నాలుగు దొరుకుతేచాలు!

చ - ఏడ్చాడుపత్తి! మన అనుభవంలో వాడి తలతన్నిన వాళ్ళనుచూశాం! వీడిప్రయోజకత్వం, వీడి ప్రగల్భాలు యెంతవరకున్నాయో నేనూచూస్తాను!

దా - పేచీలువడి బజారు కెక్కటమేనా యింకేమన్నా వుందా?

చ - పేచీలు లేకుండా మీ బాకీ దమ్మిడీలతోసహా వసూలు చేసే పూచీనాది! ఆ నగలిలాయివ్వు! అవంతా నేను చూసుకుంటాను!

దా - ఏమన్నావ్? నీకివ్వనా?

చ - నన్ను నమ్మటంలేదా? (ప్రక్కగా చూస్తాడు)

దా - అని అన్నానా! (చిన్నగానవ్వి) నీకివ్వటానికి నాకెప్పుడూ సందేహంలేదు! నాకుకావలసింది వడ్డీ అసలు ఫాయిదాలతోసహా బాకీ వసూలు చేయటం! నగలు తర్వాత పట్టుకుపో! కాని......

చ - అప్రకాశంగాడు నన్ను బజార్లో నిలబెడతాడో, నేను వాణ్ణి నిలబెడతానో చూపిస్తా! వాడనుకున్నట్లు యీ చలమయ్య చేతగాని చవటకాదు! చూపిస్తా తఢాకా!
(రాధ లోపలనుంచి వస్తుంది)

దా - ఏమన్నా చూపించు! నాకు కావలసింది నాడబ్బు.

రా - (హేళనగా) అని నువ్వు వేరుగా చెప్పక్కర్లేదు మామయ్యా! అందరికీ తెలిసిన విషయమే! (చలమయ్య, రాధ నవ్వుతారు)

దా - మళ్ళీవచ్చావ్!... ఇదిగోపిల్లా! పనిమీదెడుతున్నాను యెక్కడికి అని మళ్ళీ అడగకు.

రా - బావకోసం స్టేషనుకి...

దా - బండి తీసుకెళ్ళమని పాలేరుకి పొద్దునే చెప్పాన్లేవమ్మా

చ - (అర్థంకానట్లు) మధువస్తున్నాడా?

దా - (రాధనుచూపిస్తు) దానిమిడిసి పాటంతా అదే

రా - (సిగ్గుగా) పో మామయ్య.

దా - పోతున్నాంలేవమ్మా! (నవ్వి చలమయ్యను చూస్తాడు యిద్దరూ బయటకు వెడతారు. రాధ వాళ్ళు పూర్తిగా వెళ్ళేవరకూ అటేచూసి ఆతర్వాత జాకెట్లోనుంచి చెలిగాడ్కవరుదీసి కూనిరాగందీస్తూ అందులో కాగితం

చూస్తూంటుంది లోపలనుంచి శరభయ్య వస్తాడు)
వచ్చేవేళయింది

శ — (అర్థంకానట్లు) ఎవరమ్మా?

రా — (తృళ్ళిపడి) నీమొగుడు.

శ — (గుడ్లుతేలేసి) ఆయనెవరంటోయ్?

రా — తెలుస్నో!

శ — ఏమో! (క్షణం ఆలోచించి అంటాడు)

రా — పోనీ, యిందులో యేముందో చెప్పు! [కవరిగ్రాం చూపిస్తుంది]

శ — ఏదో కాగితం.

రా — కవరులో కాగితం వుండక గరిటవుంటుందా?

శ — అంటే అది ఒకఉత్తరం.

రా — [గుడ్లుతేలేస్తూ] అట్లాండే పెనం అన్నావుకాదు.

శ — [చిరాకుగా] పోండమ్మా! నాకు తెలియదు [లోపలకు వెళ్ళబోతాడు]

రా — [దారికి అడ్డుగా వెళ్ళి] తెల్సుకుంటేనేవుంది తెలివి! [శరభయ్యను వుక్కిలిస్తూ పాడుతుంది]

ఓ.........

ఓహో! ఓహో! హో!! ఓహో! హో హోహో!!!

హ్హా హ్హా హ్హా హ్హా హ్హా! ఓహో హ్హా! శరభయ్యా.

శ – ఆ! [గుడ్లు మిటకరిస్తాడు]

రా – అదియేమొ తెలియద, పోవయ్యా

ఈ యింట్లో పనికిరావు శరభయ్యా॥

శ – ఏమిటీ?

రా – ఇందులోని వార్త

అందిన శుభవార్త

ఇంటి కెవరొ వస్తారయ్యా

వారెవరో తెల్సుకో శరభయ్యా!

శ – (అనుమానాస్పదంగా) ఎవరబ్బా!

రా – తిన్నతిండి అరగని భోగులకు

నిరుపేద రోగులకు, జోగులకు

మందిచ్చే దెవరో చెప్పవయ్యా

వారే వస్తారుటయ్యా శరభయ్యా॥

శ – (సంతోషంగా) చిన్నబాబుగారా?

రా – అదియేమొ తెలియదు.

అతనెవరో తెలియదు

తెలుసుకుంటె బహుమానం వుందయ్యా
లేకుంటే అవమానం తప్పదయ్యా

శ - సందేహం లేదువారే.

రా - ఊం! అలాగేం?

శ - అవును.

రా - చెప్పినమాటవిని చెప్పినట్లు చేయవయ్యా
బండిరాకముందే దండిగా వండవయ్యా శరభయ్యా!

శ - ఏమేమిటి వండమంటారు?

రా - వ॥ దోసకాయ పప్పు! పనసపొట్టుకూర
అప్పడాలు, వడియాలు, రొయ్యపొట్టు చారు
అవ్వంటే బాబుగారికిష్టం! లేకుంటే మనకు కొంతో కష్టం.

శ - ఆ! యింకా!

రా - చాలవంటె పూరగాయ తియ్యవయ్యా
అయ్యగారు వచ్చేసరికి చేయవయ్యా శరభయ్యా॥

(మిష్టర్ చిమ్‌చిమ్ బయటనుంచివచ్చి పాటవింటూ తన్మయత్వం చెందుతూ వుంటాడు చిమ్‌చిమ్‌ని చూడకుండానే)

కొంటెచూపులతోను కవ్వించే మొనగాడు
అతనే అందగాడు నన్నే పెళ్ళాడతాడు

శ – అదేమిటి? ఆముదం ఆరగించిన వాసులాగా అలా మారి పోయారు?

మి – [హెచ్చరికగా] షటప్! లిమిట్సుదాటి ప్రవర్తించద్దని లక్షసార్లు చెప్పాను. యీసారి పెద్దాచిన్నా చూడకుండా (శరభయ్యచేతిలో యినపగరిట పైకెత్తి చూపిస్తాడు. మిష్టర్ చిమ్‌చిమ్ గుటకలు మింగుతూ భయంగా గరిటనుచూస్తూ శరభయ్య చెయిపట్టుకొని నెమ్మదిగా దించుతూ) నేనేంచేశాను?

శ – వేరేచెప్పాలా? రాధమ్మనుచూసి వెకిలిగా నవ్వటం, పిచ్చిగా మాట్లాడటం యిటువంటివి చేశావో నాగరిటకు పనితప్పదు! జాగ్రత్త. [లోపలకు వెడతాడు]

మి – కరెక్టు! (కుర్చీలో కూలబడి) అపర భీముడలాగా గరిటనే గదనుచూపించి యిచ్చేశాడు వార్నింగ్! యింక మన ప్రయత్నాలు సాగనివ్వడు రోగ్.

సుధ – (బయటనుంచి వస్తూనే) ఎవరు?

మి – [సుధను చూడకుండా] నువ్వే

సు – [అర్థంకానట్లు] నేనా.

మి – [చూడకుండానే] ఆ! పెట్టబోయే ఫిలింకంపెనీలో రాబోయే హీరోయిన్‌గా రాధను తీసుకుందామని నేను ట్రయిల్సు వేస్తుంటే మధ్య నువ్వెందుకు కలగ

చేసుకోవాలీ అంట! అ! అదీ నాప్రశ్న! బుద్ధిలేదుః [సుధనుచూసి తృళ్ళిపడి] నువువ్వా! ఆ శరభయ్య గాడను కున్నాను. ఏమనుకోకు! [ప్రేమగా] మరే...

సు - [హేళనగా] తెలిసిందిలే నీబాధ.

మి - కాదుసుధా! [ప్రేమగా] మరే, మరే, ...

సు - అలా నీళ్ళునవుల్తావేం? ఏమిటో చెవ్వు.

మి - మీాయింటి కొద్దామని అనుకుంటుండగా నువ్వేవచ్చావ్.

సు - [నొసళ్ళు చిట్లించి] నాతోపనుందా?

మి - అదేమిటిసుధా! అలాఅంటావ్? ఫిలిం కంపెనీ పెట్టాక పనిలేకుండా వుంటుందా? నిన్ను చూస్తూన్నంత శేపూ...

సు - ఏమని పిస్తుందేం?

మి - మా పిక్చర్లో బుక్ చేయాలని పిస్తుంది

సు - ఆఁ!

మి - అంతేకాదు! పిక్చరు మొత్తం నీమీాద, నీనటనమీాద ఆధార పడేట్లుచేసి నిన్నొక బ్రహ్మాండమైన హీరోయిన్‌గా ప్రజాలోకానికి పరిచయం చేస్తాను! కరక్టు.

సు - (ఆశ్చర్యంగా) ఆఁ! ఏమిటీ

మి - వున్నది వున్నట్లు చెప్పటంలోనే మనకి మంచిపేరుంది. ఒకే ఒక పిక్చరుతో అమాంతంగా నిన్ను పైకితీసు గొచ్చి, ప్రస్తుతం డిమాండ్‌లోవున్న అంజలి, జమున, సావిత్రి మొదలగు పెద్దతార లందర్నీమించి పోయేలా చేస్తాను! మంచిఅవకాశం! జారవిడ్చుగోకు.

సు - (చిరునవ్వుతో) తలుచ్చుకుంటే నువ్వెంతవనీ చేస్తావ్. నాకు తెలియదూ నీసంగతి.

మి - (చిరుకోపం అభినయిస్తూ) తెలిశేవన్నమాట యింతచిన్న చూపు చూడటం! నామనస్సు గ్రహించలేక పోతు న్నావ్! నాశరీరంలో యేభాగం చూసినా నీకోసమే కలవరిస్తోంది. నీఅందమే నాకు ప్రతిబింబంలా కని పిస్తోంది!

సు - (వక్రంగాచూస్తూ) అందుకేనా నన్ను హీరోయిన్ చేస్తానంటూంది?

మి - ఇంకెందు కనుకున్నావ్! నిజంగా నిన్నుచూస్తూంటే నా దేహం పులకరించి (ప్రేమగా) నాకు యెట్లాగో వుంటుంది.

సు - నిజం! నాకూ నిన్నుచూస్తూంటే......

మి - ఎట్లాగో వుంటుందికాదూ? (రెండడుగులువేసి) కరక్టు.

సు - నాలో తెలియని ఆవేశం పెరిగిపోతుంది.

మి – (ప్రేమగా) నాలోనూ అంతే.

సు – ప్రతిక్షణం నిన్ను చూడాలనిపిస్తూంది.

మి – (పొంగిపోతూ) అరె! యిద్దరిమనస్సులూ ఒకేమార్గాన పోతున్నాయ్! యింకా?

సు – (సిగ్గుతో) ఏంచెప్పను?

మి – ఏదోవిధంగా చెప్పు! సిగ్గుపడితేయెలా? (తనుసిగ్గుపడతాడు)

సు – నీతో యెన్నెన్నో విషయాలు చెప్పాలనిపిస్తుంది.

మి – ఆ! యెటొచ్చీ దేహాలు వేరయినా యిద్దరం ఒకేమాదిరిగా ఫీలవుతున్నాం

సు – (కొంచెం హేళనగా) కరక్టు.

మి – ధన్యుడను సుధా! మనిద్దరం ఒకటైతే మన ఫిలింకంపెనీ బ్రహ్మాండంగా నడుస్తుంది! యీశుభవార్త నీకుచెప్పాలని యెంతకాలంనుంచో మనస్సు తొందరపడుతోంది! కాని, నీమాట తీసుకోంది చెప్పేధైర్యం నాలో లేకపోయింది! యెంత ప్రయత్నించినా పెదవి కదిలేదేగాదు! ఆబలహీనత నాలో యెందుకుందో, యెక్కడుందో నాకే తెలియదు! యింతెందుకు? నీఅందం, ఆపాండిత చెప్పలేని వుద్రేకం... (కరభయ్య

లోపలనుంచివచ్చి అర్థంకానట్లు వాళ్ళిద్దర్నీ చూస్తూం టాడు)

సు - (ప్రేమగా) అంటూ అక్కడే నిలబడతావేం? ఊఁ!
(సమీపించమన్నట్లు తలవంకిస్తుంది)

మి - కరక్టు! అంతలో యింత యిదిగా యాక్సెప్టు చేస్తావని నేననుకోలేదు (వెకిలిగానవ్వి) దేవిగారి అనుగ్రహాం (సమీపిస్తాడు సుధ మంచంపైనే కోపంతో చంపమీద విసురుగా కొడుతుంది) ఆగ్రహాంగా మారిందే (చంప సవిరించుకుంటాడు) డామ్యిన్సల్టు! [శరభయ్య వస్తున్నవవ్వు ఆవుకుంటాడు]

సు - యీ ప్రజంటేషన్ యివ్వాలనే యింతకాలంనుంచీ అను కుంటున్నాను యీనాటికి అవకాశం చిక్కింది! యీ నాస్వల్ప బహుమానాన్ని గుర్తుంచుకొని ఫిలింకంపెనీ వంకపెట్టుకొని ఏ ఆడపిల్ల జోలికీపోకు.

శ - [చిమ్‌చిమ్‌ను చూసి సుధతో] కరక్టు గారికి కావలసిన బహుమానమే అది! [నవ్వి] వచ్చినపని వచ్చినవిధంగా అయిందిగా! యిక దయచెయ్యండి మినిష్టరుగారూ!

సు - [అసహ్యంగా] యీ మొహానికి మినిస్టర్ కూడాను.

మి - [రోషంతో] నీమొహంకంటె రైటే! పెద్దయిల్లాలులాగా మాట్లాడినంత మాత్రాన సరిపోతుందా? నీసంగతి తెలియనివారికి?

సు – ఏమిటన్నావ్? [మిస్టర్ చిమ్ చిమ్ వేపు రెండడుగులు వేస్తుంది. చిమ్ చిమ్ వేగంగా బయటకి వెడతాడు] ఆడది కంట పడటం భయం! మృగం అయిపోతాడు యిడియట్!

శ – మా బాగా చెప్పారు! [నవ్వి లోపలకు వెళ్ళబోతాడు]

సు – ఇదిగో శరభయ్యా!

శ – కూరదింపివస్తా నమ్మా!

సు – ఇవ్వాళ స్పెషల్ యేదన్నా చేస్తున్నావా? [శ్వాస పీల్చి] వాసన మాంజోరుగావుంది.

శ – చిన్నబాబుగారు వస్తున్నారుగా.

సు – యివ్వాళే వస్తున్నారా?

శ – యీపాటికి బండీ దిగేవుంటారుకూడా

సు – ఉత్తరం వచ్చిందా?

శ – టెలిగ్రాం యిచ్చారుగా.

సు – ఏది?

శ – రాధమ్మ తీసుకెళ్ళింది. [యేదో గుర్తొచ్చినట్లు చూస్తూ] కూర మాడిపోతోంది. మళ్ళీవస్తానమ్మా (గబగబా లోపలకు వెడతాడు బయటనుండి దామోదరం చలమయ్యలు వస్తారు)

దా - ఏమేవ్ సుధా! బొత్తిగా నల్లపూసయ్యావేమేవ్! యివ్వాళ మామధు వస్తున్నాడు.

సు - ఎవర్నన్నా స్టేషనుకి పంపబోయారు.

దా - నువ్వెడతావని వూరుకున్నాను.

సు - ఆయనగారు ఎలావుంటారోకూడా నాకు తెలియదు. యెవ్వాడన్నా చూస్తేగా!

చల - అతనూ నిన్ను చూసి వుండడులే

సు - యిద్దరం పట్నంలో వుంటున్నా పరిచయముంటేగా! శెలవలకు వచ్చినట్లే వచ్చాడు. నేను వచ్చేసరికి మళ్ళీ పట్నం పారిపోయాడు

దా - ఆఁ! పారిపోయాడేం! (చలమయ్యతో) మొత్తానికి నీకూతురు అసాధ్యురాలే! (సుధ లోపలకు వెడుతుంది. అటేచూస్తూ) మంచి తెలివి తేటలున్నాయ్.

చ - ఏం లాభం? (నిట్టూర్చి) సమయానికి వుపయోగ పడలేదు! అది తెలివిగా వున్నట్లయితే ఆవెధవ మోసం చేశేవాడేనా? పెండ్లి చేసుకుంటానని నమ్మించి ద్రోహం చేశాడు! వాడు......

దా - ఎవరో. ఎలావుంటాడో నీకూ తెలియదు. ఫలానా వాడు అని అదీచెప్పదు ఆటువంటప్పుడు గతాన్ని

తెల్సుకుని మతి పోగొట్టుకుంటే ప్రయోగమేమిటి? యిప్పటికైనా అవన్నీ మర్చిపోయి పెళ్ళిచెయ్.

చ — పెళ్ళంటేనే మండి పడుతోంది.

దా — శీలం చెడలేదు కదయ్యా!

చ — అక్కడే మాపెట్టింది అమ్మాయి తెలివితేటలు! ఆ అవఖ్యాతికూడా వచ్చినట్లయితే దాన్ని అప్పుడే నరికి ముక్కలు చేశేవాణ్ణి

దా — నమ్మించినవాడు ద్రోహం చేయటానికి కారణం.

చ — ఎవరికితెల్సు? యెంత బ్రతిమిలాడినా అదిచెప్తేగా.

దా — [నిట్టూర్చి] సుధను నేను అడిగి చెప్పిస్తాను. పెళ్ళికి వప్పిస్తాను సరేనా [లోపలనుంచి సుధ, బయటనుంచి రాధ వక్కసారి వస్తారు. రాధ అందర్నీ అదోలాచూసి రెండుచేతులూ వెనక్కి పెట్టుకొని దామోదరాన్ని చూస్తుంది]

రాధ — నీకో మంచిమాట చెప్తాను. బహుమాన మిస్తావా మామయ్యా.

సు — ఏంకావాలో చెప్పు. [రాధను సమీపిస్తుంది]

రా — మామయ్య అడుగుతే చెప్తాను.

దా — [హేళనగా] అడగటం దేనికి? వస్తున్నాడుగా! వాణ్ణే యిచ్చేస్తాను.

రా - ఎప్పుడూ పరిహాసమేనా?

సు - [కోంటెగా] నువ్వు చెప్పదల్చుకున్న మంచిమాట ముందునే చెప్తే నాకు నువ్వేం బహుమాన మిస్తావ్? [రాధను చూస్తుంది]

చ - తాను గెల్చుకున్నది సీకిస్తుంది. [నవ్వుతాడు]

రా - [చలమయ్యను ఒకపర్యాయం అదోలాచూసి సుధతో] చెప్పు చూస్తా.

సు - అదీ మధు వస్తున్నట్లు యిచ్చిన టెలిగ్రాం! అవునా?

దా - ఆఁ! (రాధ చిన్నగానవ్వి టెలిగ్రాం దామోదరంకి యిస్తుంది) చూశావా చలమయ్యా! నాకు వచ్చిన టెలిగ్రాం నాకు చూపించి నన్ను బోల్తావెయ్యాలని చూస్తున్నారు. [చలమయ్య నవ్వుతాడు బయటనుంచి నారాయణ వస్తాడు] పొలంతడిసిందా నారాయణా!

నా - ఫస్టుక్లాసుగా తడిసింది మామయ్యా!

చ - నారాయణ నమ్మినబంటు! చెప్పినపని చెప్పినట్లు చక్క గా చేసుకొస్తాడు దామోదరానికి అటువంటివాడు చేతి క్రింద వుండటం చాలాఅదృష్టం! అతని మంచితనం ..

నా - [హేళనగా] నిన్ను మించిపోలేదు లేచలమయ్యా! [దామోదరం నవ్వుతాడు] వెళ్ళొస్తాను మామయ్య.

రా - నేనూవస్తా నుండన్నయ్యా!

దా - నువ్వెక్కడికీ!

నా - మామయ్య మాటకు అడుగుదాటకూడదు.

రా - తిండి తినద్దేమిటి?

దా - ఆ తిండి మా యింట్లోనూ తినచ్చు.

నా - మామయ్యకు కోపం ముక్కుచివరుంటుంది! ఆయన మాట కాదంటే లాభంలేదు! వుండమన్నప్పుడు వుండాల్సిందే. [నవ్వి] తాళాలు యిలాయివ్వు! [రాధ తాళాలగుత్తి అందిస్తుంది నారాయణ బయటకి వెడతాడు]

సు - స్నేహం స్నేహమే చుట్టరికం చుట్టరికమే (చలమయ్యతో) మీ దామోదరంగారు మేనకోడల్ని వుండమన్నారుగాని నిన్నూ నన్నూ వుండమన్నారేమో చూశావా నాన్నా.

దా - (సుధను చూస్తూ) అప్పుడే అంత వెలిపడతావేమే! సమయానికి నువ్వు వచ్చావనేగా రాధనుకూడా వుండమంది! మీ యిద్దరితోపాటు చలమయ్య.

చ - (చిన్నగా నవ్వి) మధు ఎలాగూవస్తూండే యీ విందు రాత్రికే యేర్పాటుచేస్తే చాలా బాగుంటుంది.

సు - అవును నాన్నా! అలాచేస్తేనే బాగుంటుంది

దా - (రాధను చూస్తూ) నువ్వేమంటావే!

రా - నువ్వన్నదే నేనూ అంటా.

దా - చూశారా రాధ యెలా తప్పించుకుందో! తెలివంటే దానిది!

సు - (కొంటెగా) కాబోయే కోడలుకదూ?

రా - నువ్వూ మరీలే.

చ - అది అలావుంచినా ప్రతిమాటకు వ్యతిరేకిస్తే నీకు కోపం వస్తుందని యిప్పుడేగా వాళ్ళన్నయ్య చెప్పెళ్ళాడు!

రా - ఉహూ! (తల విదిలిస్తుంది)

సు - అయినా యీమధ్య చాలా చమత్కారంగా మాట్లాడటం నేర్చుకుంది

రా - (దెప్పుతున్నట్లుగా) ఎలా నేర్చుకుంటాను! నేను పట్టణంలోవుండి చదివానా! నలుగుర్లోనూ తిరిగి మాట్లాడానా! వాటికి అలవాటు పడ్డవాళ్ళయితేనువ్వన్నట్లు ఒక మాటకు పది అర్థాలు వచ్చేటట్లు మాట్లాడతారు.

సు - చేతకాదంటూనే చక్కగా పెట్టింది వాత!

చ - (వెటకారంగా) అంతేలే! ఎవరిరాత యెలావుందో యెవరు చెప్పగలరు? పిట్ట చిన్నదైనా కూత ఘనంగానే వుంది!

రా - (కటువుగా) ధోరణి ఆపండి చలమయ్యగారూ! వయస్సుకి పెద్దవాడివి అనవసరంగా నోరు పారేసుకునేకంటే ఆలోచించి మాట్లాడటం బాగుంటుంది.

దా - (మందలింపుగా) రాధా! పెద్దాదిన్నా చూసుకాస్త!

చ - ఎలాచూస్తుంది? మామయ్య యిచ్చిన చనువు అటు వంటిది.

సు - (సర్దుబాటు చేస్తున్నట్లు) వూరుకోండినాన్నా! అదిమాత్రం యేమంత తప్పుగా మాట్లాడింది! చనువుమీద యేదో అంది.

చ - అంటుందంటుంది. మనం కన్ను తెరిస్తే యిదీ ఆనారాయణా......

సు - వూరుకోండి నాన్నా! (రాధతో) నాన్నకోపంలో యేదో అన్నాడని బాధపడకు! ఆయనతీరే అంత. (రాధ బయటికి వెడుతుంది)

దా - "పిచ్చుకమీద బ్రహ్మాస్త్రమన్నట్లు" దానితోనా నీకు వాదం! దాన్ని నేమందలిస్తాను.

చ - అనే యింతవరకూ వూరుకున్నాను. లేకుంటే యెప్పుడో వీధిలోకి లాగేవాణ్ని!

సు - (విసుగ్గా) ఏమిటి నాన్నా మీరు అనేది? వాళ్ళేం వరాయివాళ్ళా? దామోదరంగార్కి కావలసిన వాళ్ళు! యీమాత్రం దానికి వీధికి......

చ - లాగటంకాదు తల్చుకుంటే వున్న పంచకూడా స్వాధీనం చేసుకోగలను!

దా - (అర్థంకానట్లు) ఆఁ! స్వాధీనమా? (సుధ సిట్టూర్చి బయటకు వెడుతోంది) నారాయణ నీకు బాకీ వున్నాడా!

చ - వాడి తండ్రి కనకయ్య బ్రతికుండగా వ్రాసిన తనఖా పత్రం సంగతి మర్చిపోయారా?

దా - (నొసల్లు చిట్లించి) పైకం యిచ్చింది నేనుగా.

చ - తనఖా నాపేరునగా వ్రాయించింది.

దా - ఏదో స్నేహం మీద వ్రాయిస్తే మామధ్యనున్న బంధుత్వం మర్చిపోయి మాట్లాడుతావా?

చ - ఆ అభిమానం వాళ్ళల్లో కూడా వుంటే బాగానే వుండేది. అయిన వాళ్ళుగా అభిమానస్తులుగా వుంటూ కాళ్ళ క్రింద గోతులుతీసే వ్యక్తుల్ని గుర్తించటం మంచిది.

దా - (ఆశ్చర్యంగా) నువ్వనేది నారాయణ గురించేనా?

చ - అంత ఆశ్చర్యం మీలో కలుగుతుందని ముందే అనుకున్నాను. పైకి మంచివాళ్ళుగా నమ్మకస్తులుగా కనుపించే వాళ్ళే యెంతటి ఘోరాలైనా చేసేది! వాళ్ళే తడిగుడ్డలతో గొంతులు కోసేది! వాళ్ళే నమ్మకంగా నెత్తిన చేతులు పెట్టేది! (ఆలోచనలో పడ్డ దామోదరాన్ని ఆదోలాచూసి తగ్గుస్థాయిలో) నేనేంచెప్పినా నీమనస్సుకి యెక్కకపోవచ్చు! వాళ్ళమీదున్న అభి

మౌనం అటువంటిది! ఇవ్వాళ వినకపోయినా పరిస్థితులు విషమస్థితిలోకి వచ్చినాకైనా నామాటలు గుర్తు రాకపోవు! అప్పుడు పశ్చాత్తాప పడకాపోవు! (దామోదరం చలమయ్యను చూస్తాడు) అయినా నాకెందుకు? మంసన్నిహిత స్నేహాన్ని బట్టి నారాయణ చేస్తున్న తప్పుడు ప్రచారానికి నామనస్సు వుండబట్టక చెప్పాను

దా - (ఆశ్చర్యంగా) తప్పుడు ప్రచారమా?

చ - నమ్మకంలేదా?

దా - ఎవరితో?

చ - మనం కోరినప్పుడల్లా సాక్షులు రాను! అవసరంవస్తే రాకుండాను వుండరు!

దా - ఏమన్నారు?

చ - విని వూరుకోటానికి ఒకమాటా? నువ్వు పిసినిగొట్టువట. నీజీవితంలో పిల్లికి బిచ్చంవేసి యెరగవుట! కాబూలీ వాడికంటే కర్కశంగా వడ్డీలకి వడ్డీలు వేసి పేద ప్రజానీకాన్ని పిండుకు తింటున్నావుట! వాళ్ళనుబట్టి నీకీ వూళ్ళో వరవతుందిటగాని, లేకుంటేవూళ్ళో ప్రజలంతా ఎప్పుడో పేడకళ్ళాపీకొట్టి నిన్ను యీవూరు నుంచి తరిమే వాళ్ళుట.

దా - (కోపంతో పళ్ళుకొరుకుతూ) అంత తెగించాడా?

చ - అంతేనా? వాళ్ళను గురించి చెప్పాలంటే రోజులు చాలవు! (దామోదరం అనుమానిస్తున్నట్లుగా చల

మయ్యను చూస్తాడు) యింకా అనుమానమేనా? నాగురించి నీకు వేరేచెప్పాల్సిన పనేలేదు! వున్నవిలేనివి కల్పించి చెప్పేఅలవాటు నాకులేదని నీకు తెల్సును.

దా - ఇంతవరకూ యెందుకు చెప్పలా?

చ - స్నేహితుడుమనస్సు కష్టపెట్టటం యిష్టంలేక! మనస్నేహం అలాంటిది. వ్యవహారం ముదిరిపోయింది. వుపేక్షించి వూరుకుంటే యెంతటి తలవంపులకు తలవంచాల్సి వస్తుందోనన్న కంగారులో యిప్పుడన్నా చెప్పాను. (దామోదరాన్ని సమీపించి) యిప్పటికీ మించిపో యిందిలేదు! నామాటవిని నేచెప్పినట్లుచేస్తే అంతాసర్దు బాటవుతుంది! ఆనారాయణ గాడికి తగిన గుణపాఠం చెప్పిన వాళ్ళమవుతాం.

దా - ఏవిధంగా?

చ - ఎత్తుకి ఎత్తు వేయటమే

దా - ఏంచెయ్యాలంటావ్? (నారాయణ బయటనుంచి వస్తాడు)

చ - సమయం కనిపెట్టి చెప్తానుగా.

నా - (హేళనగా) స్నేహితులిద్దరూ యేదోపాచిక వేస్తున్నారే.

దా - మా పాచికలకే లే నారాయణా! యెవ్వడూ వుండేవే. పిల్లికి బిచ్చం వేయని పిసినిగొట్టునైనప్పుడు మాటల

కోసం పాచికలూ వేయాలి.–ప్రగల్భాలూ కొట్టు
కోవాలి

నా – మీరాద్వంద్వార్థం మాటలు సరిగా బోధపడటల్లేదు. అంత మాట నిన్నెవరన్నారు?

చ – ఎవరెన్నినుకుంటే ఆయనకొచ్చిన నష్టమేమిల్లే.

దా – నాసామ్మి మహాత్యమది! అనుకోనియ్! (నారాయణ చలమయ్య వంక అదోలాచూస్తాడు)

చ – ఆ! ప్రకాశంను తాకట్టు విడిపించుకోమంటే యెవరితోనో యేదో కూశాడుట గాడిద.

నా – (చిన్నగా నవ్వి) యింతేకదా?

చ – ఆగాడిద కూతల్ని పట్టుగు గుంజుకుంటున్నాడు మీామామయ్య!

దా – గుంజుకోవాల్సిన అవసరం నాకేమిటి? కుక్క కాటుకి చెప్పుదెబ్బన్నట్లు దెబ్బకుదెబ్బ తీసితీరాలి.

చ – దానికి తగ్గసలహాయివ్వనే యిచ్చాను. తాకట్టు వాకట్టు అయినట్లు చెప్తేసరి.

నా – (యీర్ష్యగా) ఇటువంటి సలహాలివ్వటంలో సీతర్వాతే మరొకళ్ళు! ఒకళ్ళను గురించి ఒకళ్ళకువున్నవీ లేనివీ కల్పించిచెప్పే అలవాటు ప్రకాశానికి వుందంటే నేను నమ్మలేను

దా - ఆనమ్మకం మాలోకూడా వుండాలి.

నా - లేదని అన్యాయం చేయటం ధర్మమా? అతను పేద వాడు.

దా - అందుకని కనికరించి విడిచిపెట్టమంటావా? ఎంత అభిమానం! అంత అభిమానస్తుడవైతే ఆబాకీ నువ్వే తీర్చరాదూ?

చ - (వెటకారంగా) ఇంతవరకూ నీబాకీ తీర్చలేక పోయాడుగాని, యీబాకీ తీరుస్తాడే నారాయణ.

నా - నీబాకీయేమిటి?

చ - ఇవ్వాళ గుర్తుంటుందా? రేవు యిల్లుస్వాధీన వచ్చుకుంటే....

నా - (తీవ్రంగా) చలమయ్యా

దా - అవును నారాయణా! యిల్లు తాకట్టుపెట్టి చలమయ్య దగ్గిర అయిదు వేలు పుచ్చుకున్నాడు మీనాన్న.

నా - (అర్థంకానట్లు) మానాన్న యింటిమీద అయిదువేలు అప్పుచేశారా యీ చలమయ్య దగ్గర.

చ - అవును.

నా - ఎప్పుడు?

చ - బతికున్నరోజుల్లో! స్వదస్తూరిన వ్రాసిన పత్రమే వుంది.

నా - అంతడబ్బు తీసుగోవల్సిన అవసరం యెందుకొచ్చింది?

చ - చచ్చిన మీనాన్న నడుగు.

నా - (కోపంతో) చలమయ్యా! (రెండడుగులు వేస్తాడు)

దా - (మందలింపుగా) నారాయణా! (నారాయణ ఆగి దామోదరాన్ని చూస్తాడు) కలరావ్యాధితో మరణించిన మీ అక్కయ్య పెళ్ళికి తీసుకున్నాడు. అప్పుడు నువ్వు చిన్నవాడవి! యీ సంగతి నీకు తెలియక పోవచ్చు

నా - ఇంతవరకూ నాతో యెందుకు చెప్పలేదు?

చ - ఇప్పుడు చెప్పానుగా! బాకీ చెల్లించాలనుకునే బుద్ధిమంతుడవే అయితే ఆ పనేదో తొందరగా చెయ్!

నా - నువ్వన్నా చెప్పావుకాదేం మామయ్యా.

దా - (చిన్నగా నవ్వి) పెద్దవాణ్ణి! నాకు గుర్తుండేస్తుందా?

నా - మావరి స్థితి నీకు తెల్సును! యిప్పుడు నేనేంచేసేది?

దా - ఏదో పధకంగా చేయాలి! యిద్దరూ కలసి వీధినపడటం మాత్రం మంచిదా?

చ - అంతపనీ జరగంది వసూలు అవుతుందంటే నాకు నమ్మకంలేదు!

నా - (చలమయ్యను కటువుగా చూస్తాడు)

దా - నారాయణా! కళ్ళు పెద్దవిచేసి చూస్తే లాభమేమిటి? యేదో సమాధానం చెప్పి సర్దుబాటు చేసుకోవాలి! (చలమయ్యను సమీపించి) ఇదిగో చలమయ్యా!

మనం మనం చాలాకాలంగా స్నేహితులం! వాళ్ళు నా చెల్లెలు బిడ్డలు! పదిరోజులుపాటు గడువిస్తే...

చ - (స్థాయిగా) నారాయణ తీర్చకపోతే నువ్వు తీరుస్తావా?

దా - మధ్యనా కేంపని?

చ - నీకు పనిలేనప్పుడు నువ్వూరుకోటం మంచిది! (నారాయణతో) ఏం నారాయణా! యేమిటి నీజవాబు?

దా - ఏదో చెప్పు నారాయణా! తప్పుతుందా?

నా - మామయ్య చెప్పినట్లు పదిరోజులు గడువివ్వండి

చ - దామోదరం ఎవ్వకుంటే పదిమాసాలైనా యిస్తాను. లేకపోతే పదిఘడియలుకూడా యివ్వను.

నా - (దామోదరాన్నిచూసి యాచనగా) మాటమాత్రం సాయం చెయ్యలేవా మామయ్యా.

దా - ఇటుస్నేహం, అటుబంధుత్వం! యెటుచెప్పినా కష్టమే. మధ్యన నన్నిరికించి బాధపెట్టేకంటే మీకుమీరే ఒక మార్గానికి రావటం మంచిది

నా - అంతేనా మామయ్యా! మాయోగక్షేమాలు చూడాల్సిన బాధ్యత నీకులేదా మామయ్యా!

దా - వున్నా నేనేమీ చేయలేను. పరిస్థితి అటువంటిది.

నా - (అర్థంకానట్లు) అంటే?

చ - క్రితం యెన్నోసార్లో మీకుటుంబ విషయాల్లో అంటీచు కోని అల్లరి పడుంటూరు.

నా - (చలమయ్యను కటువుగాచూసి) అని నువ్వంటు న్నావా?

దా - (నిర్మొహమాటంగా) నేన నేదికూడాఅనే.

నా - (శూన్యంగాచూస్తూ) మామయ్యా.

చ - ఏం? వున్నమాటే అన్నాడు.

నా - (కటువుగా) ఏమిటా వున్నమాట?

దా - ఏదైనా గతాన్నిగురించి తవ్వుకునే అలవాటు నాకు లేదు అయిన వాళ్ళన్న అభిమానం నాలోవుంది కాబట్టే మిమ్మల్ని చేరనిచ్చి గౌరవిస్తున్నా కాని, మీనాన్న చేసిన పనికి పరాయికళ్ళయితే మీ మొహాలు కూడా చూసేవాడు కాదు.

నా - ఏంచేశారు?

చ - (వెటకారంగా) ఏంచేశాడా?

దా - నా అన్న అభిమానంకూడా మర్చిపోయి, శివాలయా నికి నేను ధర్మకర్తగావుండ తగనని నాకు వ్యతిరేకంగా కోర్టులోసాక్ష్యం యిచ్చాడు. పసుపు కుంకుమ క్రింద నేను నాచెల్లెలకు యిచ్చిన రెండెకరాలూ తనబాబు సొమ్ములాగా అమ్ముకుతిన్నాడు యింతకంటే యేం చెయ్యాలి? యిప్పుడు యీ నీవ్యవహారంలో అడ్డొ

వుంటే నీవల్ల మాత్రం నా పరువు నిలుస్తుందన్న నమ్మక మేమిటి?

చ - (వెటకారంగా) ఆబాబు కొడుకొక్కడూ?

నా - (ఉద్రేకంతో) చలమయ్యా! హద్దూ అదుపులేకుండా మరోసారి పొల్లుమాట వచ్చిందంటే మర్యాద దక్కదు

చ - ఎవరికుండాల్సిన మర్యాద వాళ్ళకుంది! నెత్తురూ చీము వున్న మనిషివైతే దమ్మిడీలతోసహా నా బాకీ తీర్చు!

నా - (కోపంతో) తీర్చకపోతే?

చ - జరగాల్సిన పరాభవం జరిగి తీరుతుంది.

నా - ఏంచేస్తావ్?

చ - ఇల్లు స్వాధీనం చేసుకుంటాను.

నా - నీతరంకాదు.

చ - అవునో కాదో చూపిస్తా.

నా - గడపలో కాలుపెడితే అక్కడే బలినరుకుతాను.

చ - (ఉద్రేకంతో) నరుకుతావో, నరికించుకుంటావో రేపు చూశాక్లే.

దా - (పెద్దగా) చలమయ్యా! మీకు కావలసింది కొట్లాటా? ఏదోవిధంగా సర్దుబాటు చేసుకోటమా?

చ - ఆమాట అడగాల్సింది నన్నుకాదు.

దా - ఇద్దర్నీ అడుగుతున్నా.

చ - నోటికొచ్చినట్లల్లా కూస్తూంటే పడుంటానికి యీ చలమయ్య చచ్చు సన్యాసికాదు.

నా - (కోపంతో) యీ నారాయణే అంత పుచ్చుసన్యాసి.

దా - (విసుగుతో) అబ్బబ్బ! కాస్త నామాట వినండర్రా.

నా - [స్థాయిగా] ఏమిటి వినేది?

చ - తాకట్టుబాకీ విడిచిపెట్టమనా నువ్వనేది?

నా - ఆ చలమయ్య అసభ్యపు కూతలకు తలవంచమనా నువ్వనేది?

దా - [విసుగుతో వెటకారంగా] కాదు చేతిలోవున్న కర్రల్తో యిద్దర్నీ తలకాయలు పగలుకొట్టుకో మంటున్నాను నలుగురూ నవ్వుతారని సిగ్గుండాలి.

చ - [వెటకారంగా] అదుంటే బాకీ యెప్పుడో తీర్చేవాడు.

నా - [దెప్పుతున్నట్లుగా] అదిలేదు కాబట్టే పచ్చగా బ్రతికే వాళ్ళ నెత్తిన నమ్మకంగా చేతులు పెట్టాలని చూస్తున్నావ్?

చ - అక్కడికి నువ్వు చాలా బుద్ధిమంతుడివి! సిగ్గుండాలి

నా - మరోపాల్లు మాటలో స్నేహించకు నీఆటలు దామోదరం గారి దగ్గర సాగినట్లు యీ నారాయణ దగ్గర సాగవ్ జాగ్రత్త! [వెళ్ళబోతాడు]

చ - పిచ్చిగా వాగుతే పళ్ళురాల్తాయ్.

నా - [ఆగి] ఆరోజువచ్చింది కాబట్టే యీ నారాయణతో పేచీ పెట్టుకుంది! నీపొగడ్తలకు తలవంచి నీఅసభ్యప్రవర్తన గుర్తించకుండా నీఅడుగులకు మడుగులొత్తే దామోదరంగార్కి వినిపించు నీమాటలు.

దా - ఏమన్నావ్?

నా - జరుగుతున్నమాటే అన్నాను! యీ చలమయ్య యెంత వరకూ నిజాయితీ పరుడో తెలిసుండీ పిలక చేతికిచ్చి తలకు టోపీపెట్టించుకోపోతున్ననువ్వు. యేనాటికైనా యదార్థాన్ని గ్రహించపోవు.

చ - [దామోదరంతో] చూశావా! నోటికొచ్చినట్లు యెలా పేలుతున్నాడో! నీమొహంచూసి వూరుకుంటున్నాను గాని......

నా - లేకపోతే యేమిటి నువ్వుచేసేది? (చొక్కా పట్టుకొని) నీగురించీ నీకున్నపరువు ప్రతిష్టలు గురించీ అందరికీ తెలుసును! బజార్లో నిలబెడితే అణాడబ్బులకైనా అమ్ముడుపోని నీకు, మానాన్న యిల్లుతనఖా పెట్టాడంటే యెవరునమ్మేది? [చొక్కా గుంజుతాడు] ఎలా నమ్మేది? తనఖా పత్రంమీద డబ్బిచ్చిందెవరో తెలిసే మీచేత చెప్పించాలని చూశాను! యిప్పుడు చెప్తా.

దా - [పెద్దగా] నారాయణా!

నా - (చలమయ్య చొక్కావిడిచి దామోదరంతో) ఏం? అసలు రహస్యం తెలిసిందేమోనని భయపడుతు న్నావా? సర్వం తెలిసే తెలియనట్లు అడిగాను.

దా - (అర్థంకానట్లుచూస్తూ కటువుగా) ఏమిటి నువ్వనేది?

నా - ఎంగిలి మెతుకులుతిని కడుపు నింపుకొనే చలమయ్య దగ్గర మానాన్న రాగికాసీ పుచ్చుకోలేదంటున్నాను.

దా - లేనప్పుడు తనఖా పత్రం ఎలా వ్రాశాడు?

నా - దగ్గరుండి వ్రాయిస్తే.

దా - అంటే పైకం యివ్వకుండానే వ్రాయించాననా?

నా - అని అన్లేను! అప్పిచ్చిన పెద్దమనిషి యెవరిపేర వ్రాయ మంటే తీసుకున్న పెద్దమనిషి వాళ్ళపేర వ్రాస్తాడు. అలాగే యీ చలమయ్య పేర ఆ తనఖాపత్రం సృష్టింప బడింది! యీ రహస్యం నాకు తెలియదను కున్నాడు చలమయ్య (చలమయ్యను చూస్తూ) ఆవ లిస్తే పేగులు లెక్కపెట్టే నారాయణ దగ్గరకాదు నీయెత్తులు! మళ్ళీ యిల్లుస్వాధీనమని నాదగ్గరన్నావో కీళ్ళు తొలిగిపోతాయ్! ఒళ్ళు దగ్గరపెట్టుకు జాగ్రత్తగా బ్రతుకు! (దామోదరం చలమయ్యలను అదోలా చూసి గబగబా బయటకి వెడతాడు)

దా - (నారాయణ వెళ్ళిన మార్గంచూస్తూ చలమయ్యతో) డబ్బు నేనివ్వనట్లు వాడి కెలా తెల్సింది?

చ - (ఆమార్గాన్నే చూస్తూ) అదే నా అనుమానంకూడా.

దా - (విసుగుతో) ఏడ్చినట్టేవుంది! (ఆలోచిస్తూ) ఒకవేళ వాడితండ్రే చెప్పాడేమో! వాడితరహా చూస్తే యేకంగా పంగనామాలు పెట్టేటట్లే వున్నాడు.

చ - మాటల్లో లేదు.

దా - ఏంచేస్తావ్?

చ - నిముషాలమీద యిల్లుస్వాధీనం చేసుకుంటాను.

దా - ఎదురుతిరిగి దావాచేస్తే?

చ - సాక్షం యివ్వటానికి నువ్వు వుండనే వున్నావ్

దా - తోబుట్టువు కొడుక్కి వ్యతిరేకంగానా సాక్ష్యం? అందు లోనూ రాధను మామధుకి చేసుగోబోతూనా?

చ - తప్పేముంది? శావమర్ది అని చూడకుండా నీకువ్యతిరేకంగా వాడితండ్రి సాక్షం యిచ్చినప్పుడో? యీ బంధుత్వం అప్పుడేమయింది?

దా - (ఆలోచిస్తూనే) రాధను మధుకి యివ్వనంటే?

చ - ఆ రాధకోసమే పుట్టాడా మధు?

దా - యితర సంబంధాలు మధు అంగీకరించద్దూ?

చ - అన్నిటితోపాటు ఆబాధ్యతకూడా నామీదనేవుంచు! అన్నివిధాలా రాధను మించిన పిల్లనుI నేను కడుప్ప

కొంటాను మధువు మప్పించగల శక్తినాకుంది! వున్న పంచ కూడా వ్రాసిపెట్టుకుపోయాక పైతుండుతో బజార్లో నిలబడే నారాయణ చెల్లెల్ని యేంచూసి చేసుకుంటాడు మీమధు? తనకున్నా ఆస్తికి, చదువుకి చూస్తూ చూస్తూ ఒక సన్యాసి చెల్లెల్ని యెలాచేసుకుంటాడు?

దా - నా చెల్లెలకు యిచ్చినమాట? (ఆలోచిస్తాడు)

చ - చచ్చిన మీ చెల్లెలుతో తీపోయింది! సమయం అనుకూలించనప్పుడు చుట్టరికమేమిటి? చుట్టరికం.

సుధ - (బయటనుంచి వస్తుంది) అమ్మ భోజనానికి రమ్మంటోంది నాన్నా.

చ - వస్తున్నాను.

దా - (తేరుకుని) ఏది యెలావున్నా తనఖాపత్రం నాదగ్గర వుంటంకూడా మంచిదికాదు! అది......

చ - నాదగ్గరే వుంచుతాను! తీసుకొచ్చియివ్వు! (దామోదరం సరేనన్నట్లు తలవూపించి లోపలకు వెడతాడు. ఆమార్గంని చూస్తూ మీసం సవరించుకుంటాడు)

సుధ - (అర్థంకానట్లు) తనఖాపత్రమేమిటి నాన్నా!

చ - (స్థాయితగ్గించి) ఏదైనా గ్రంథం మాంచిరస పట్టులో వుంది సుధా.

సు - అంటే?

చ - దామోదరం మనచేతిలో కీలుబొమ్మ! మనం యెలా ఆడిస్తే అలా ఆడతాడు.

సు - ఒకస్నేహితుణ్ణి అలా ఆశించటం తప్పుకాదా నాన్నా?

చ - నీకు తెలియదమ్మా! నువ్వింకా చిన్నతనంలోనే వున్నావ్! (గర్వంగా) ఒకపేదవాడు లక్షాధికారి కావాలంటే, ఒకలక్షాధికారి బిక్షుకారి కావాలి! (చిన్నగానవ్వి) స్నేహం స్నేహంగా వున్నపుడే సర్వం చక్కబెట్టుకోవాలి! జరిగిందంతా తర్వాత చెప్తాను. (ఒకసారి లోపలికుచూసి యెవరో వస్తున్నట్లు కనిపట్టి) తిండికేం తొందర్లే! నాకు ఆకలిలేదు! నువ్వూ అమ్మ తినండి! (లోపలనుంచి దామోదరం వస్తాడు కంగారుగా) నేనొకఅడుగు వెంకాలవస్తాను! (సుధ బయటకి వెళ్ళబోయి ఆగుతుంది)

దా - ఏది తనఖాపత్రం?

చ - ఆ! నీదగ్గరేవుండాలిగా.

దా - అన్ని తనఖాపత్రాలు ఒకచోటనే కట్టకట్టి పెట్టాను యినప్పెట్టె అడుగు సొరుగులో! అన్నీ వున్నాయ్. యీ తనఖాపత్రం మాత్రంలేదు.

చ - కొంప మునిగింది! యింకెక్కడన్నా దాచావేమోచూడు

దా - యింకెక్కడదాస్తాను కాట్లో! యిప్పుడేమిటి చెయ్యటం.

చ - ఒకవేళ నారాయణ కొట్టేశాడేమో.

దా - ఇనప్పెట్టె తాళాలు వాడికెవ్వడూ యివ్వందేనా?

చ - అప్పుడప్పుడు రాధ కిస్తూవుంటావుగా.

సు - ఇంకేం! ఆరాధే కాజేసివుంటుంది.

చ - అవునవును! అంతే అయుండాలి,

దా - నమ్మకంగావుంటూ కొంపముంచారు.

చ - ఇప్పుడన్నా తెలిసిందా? (నవ్వి) మంచికిపోతే చెడు ఎలా యెదురౌతుందో చూడు.

దా - ఆ అయిదువేలకూ ఆశ వదులుకోవలసిందేనా?

చ - యీ చలమయ్య బొందిలో ప్రాణం వుండగా నేనా అంత మాట! ఎక్కడున్నా దాచావేమో నువ్వు బాగా వెతుకు! కనపడకపోతే.....

దా - ఏం చెయ్యగలం చెప్పు?

చ - రెండోకంటికి వాడికి తెలియకుండా మన దొమ్మరికోటిగాణ్ణి పంపానంటే నారాయణ యిల్లంతా సోదాచేసి వున్న కాగితాలన్నీ తెస్తాడు.

దా - అదీ నిజమే! ఆలశ్యం అమృతంవిషం అన్నారు! యింకా యెక్కడ వెతగను! ఆపనేదో యీరాత్రే చేయిద్దాం వుండు వస్తా! (గబగబా లోపలకు వెడతాడు)

చ - (లోపలకుచూసి) నేనూ దామోదరం దొమ్మరికోటిగాడి యింటికిపోయివస్తాం! మధు యింటికి వచ్చే వేళయింది. తెలివివుపయోగించావా మధునీ (చిన్నగా నవ్వుతాడు)

సు - (ఆదుర్దాగా) నాన్నా!

చ - అవునమ్మా! వాడెవడో నమ్మించి మోసంచేశాడని బ్రహ్మచారిణిగావుండి పోతావా? హాయిగా వివాహం చేసుకుంటే దామోదరం ఆ స్త్రీతోపాటు మధుకూడా నీవాడవుతాడు! నామాటవిను తల్లీ! (సుధ యేదో చెప్పబోతుంది) నువ్వేమీ చెప్పద్దు! బాగా ఆలోచించు! (దామోదరం లోపలనుంచి వస్తాడు) పోదామా కోటిగాడి యింటికి? . . .

దా - ఊఁ! పద! (సుధనుచూస్తూ) మధు బండిదిగి వచ్చేటయమయింది! అంతవరకూ యిక్కడేవుండు సుధా! (వెళ్ళబోయి ఆగి) యీ సంగతులు యేమీ చెప్పబోకు సుమా! (సుధ సరేనన్నట్లు తల ఆడిస్తుంది దామోదరం చలమయ్యలు బయటకి వెడతారు సుధ రెండు క్షణాలు ఆలోచించి నవ్వుతుంది)

సుధ - ఓ... .....

బ్రతుకే సాఫల్య మవునుగా
కోరికలె యీడేరుగా ॥బ్రతు॥

వండెను నా నోములపంటా
పొందెద నాజీవితజంటా
లేదుకదా వేరొక తంటా!
కాదనువారే లేరంటా! ||బ్రతు||

మాంగల్యమె ఆడదానికి ఆభరణం
వచ్చినది వచ్చినది ఆతరుణం
నామదిలో కలిగిన ఆనందం
ఆ దేవద జీవిత అనుబంధం ||బ్రతు||

(బయటనుంచి మధు కోటు భుజానవేసుకు వస్తాడు. అతనివెనకే పాలేరు బెడ్డింగు తీసుకొచ్చి లోపలకు వెడతాడు. సుధ చూడకుండా పాడుతూనే మధుని ఢీకొంటుంది. మధుసుధ ఒకరినొకరు ఆశ్చర్యంగా చూసుకుంటారు)

సు – (తెల్లబోయి చూస్తూ) మిస్టర్ రావ్.

మ – ఏం! కలవర పడుతున్నావా? యెందుకిక్కడికి వచ్చావ్?

సు – నువ్వొస్తావని తెలిసి.

మ – నాతో నీకేంపని? మనిద్దరిమధ్యనా సంబంధం యేనాడో తెగిపోయింది.

సు – మీరు ఊఁ అంటే మళ్ళీ యీనాడు ముడిపడుతుంది.

మ – అంటే?

సు - (మోహంగా) ఆ వేళ శరత్ శరీరాన్ని మర్చిపోయి మాట్లాడకు! ఆలోచించి మరీ మాట్లాడు.

మ - ఆలోచించే మాట్లాడుతున్నాను. ముందు బయటకినడు ఊఁ!!

శర - (గబగబా లోపల్నుంచివచ్చి) ఆఁ! చినబాబుగారూ! వ్యోత్న శేవయ్యింది బాబూ! కులాసాగా వున్నారా! (రాధ బయటనుంచి వస్తుంది)

మ - (శరభయ్యను చూసి యేదో అనబోతాడు)

రా - ఎంత శేవయింది వచ్చి?

మ - ఓ! మరదలుగారా! (హేళనగా) తమరు యింటి దగ్గర నుంచేనా వచ్చింది! (సుధను అదోలా చూసి శరభయ్యతో) శరభయ్యా స్నానం చేయాలి నీళ్ళుతోడు. (శరభయ్య లోపలకు వెడతాడు) నారాయణ బాగున్నాడా రాధా!

రా - మీ దయవలన!

మ - ఊఁ! (నవ్వి లోపలకు వెడతాడు రాధకూడా వెడుతుంది)

సు - (గట్టిగా నిట్టూర్చి) నన్నూ అవమానం చేర్చినవ మిస్టర్ రాజ్ అలిసే యీనాటి మాట. (దామోదరరావు చలమయ్యలు బయటనుంచి వస్తారు) ఆ మధు...

డా - ఏడీ వచ్చాడా? (సుధ అవునన్నట్లు తలవంకిస్తుంది. దామోదరం గబగబా లోపలకు వెడతాడు)

చల - ఎలావున్నాడమ్మా మధు?

సు - మీరు పేరుతో నాకు పరిచితుడే?

చ - ఏమన్నావ్?

సు - ఆనాడు నన్ను ప్రేమించి నా ప్రేమను తిరస్కరించిన మిస్టర్ రావే యీ మధు!

చ - (త్రుళ్ళిపడి) ఆఁ!

సు - అవును నాన్నా!

చ - ఏమన్నాడు నిన్ను చూసి.

సు - బయటకి పొమ్మన్నాడు.

చ - నా కూతురువని తెలుసా?

సు - తెలియ వచ్చాను.

చ - తెలియవచ్చినా నిరాకరించాడా?

సు - నిరాకరించటమే కాదు లేని అపవాదుకూడా నెత్తిన రుద్దాడు.

చ - అపవాదా?

సు - యిష్టంలేకపోయాక యెన్నన్నా అపవాదు లేస్తారు.

చ - అదేదో యిప్పుడే తేలుస్తానుండు. (లోపలకు వెళ్ళ బోతాడు)

సు - (చెయ్యిపట్టుకొని) నాన్నా! (చలమయ్య ఆగుతాడు) తొందరపడకు నాన్నా! ఆస్తి, నీచేతిలోవుంది! కుక్క కాటుకి చెప్పుదెబ్బ అన్నట్లు యెత్తుకి పైయెత్తు వెయ్యాలి! యుక్తిగా కార్యం సాధించాలి. (చలమయ్య అర్ధంకానట్లు సుధను చూస్తాడు) అవును నాన్నా! (సుధ తలపంకిస్తుంది)

చ - ఊం! మోసానికి మోసం కన్ను తెరిచే లోపుగా సర్వం తరుమారు చేస్తాను లంచాధికారి దామోదరం బిచ్చాధికారి. యీ చలమయ్య లంచాధికారి!

సు - అనవసరంగా నా నెత్తిన రుద్దిన అపవాదు ..

చ - ఆ బాధ నెత్తినేసుద్దు ఆదెబ్బతో......

సు - మాటలు చెదిరిపోతాయ్. (లోపలకు చూసి కంగారుగా స్థాయితగ్గించి) దామోదరంగారు.

చ - రువ్వింటికిపో! అదేదో తేల్చుకునే వస్తాను నేను (సుధ గబగబా బయటకి వెళుతుంది చలమయ్య అటూ యిటూ తిరుగుతుంటాడు. దామోదరం లోపలనుంచి వస్తాడు)

దా - ఇంకాయేమిటి ఆలోచిస్తావ్ చలమయ్యా.

చ - అమ్మాయిని గురించే!

దా - చెప్పానుగా పెళ్ళి చెయ్యవయ్యాని.

రా - మామయ్యా! (ఒక్క సారి మధునిచూసి వస్తున్న యేడుపుని ఆపుకుంటూ గబగబా అక్కణ్ణుంచి బయటకి వెడుతుంది)

దా - ఈనిర్ణయం ప్రకారం జరిగితీరాలి.

చ - (చిన్నగానవ్వి) జోస్యుల్ని తీసుగొస్తాను వెంటనే ముహూర్తంకూడా పెట్టించండి! (నవ్వుతూ బయటకి వెడతాడు)

మ - అదికాదు నాన్నా.

దా - ఏదైనాసరే. ఆలోచన లేకుండా చేసిన అపరాధానికి......

మ - ప్రాయశ్చిత్తమా యిది?

దా - తండ్రిబ్రతికి వున్నాడని తెలిసుండీ యిష్టమొచ్చినట్లు ప్రవర్తించిన దానికి పరాభవం

మ - నేను రాధనుతప్ప యెవర్నీ పెండ్లాడ తల్చుకోలేదు.

దా - ఆ జ్ఞానంవుండే నా యీ అజ్ఞానానికి తలవంచింది సుధను పెండ్లి ఆడి తీరాలి.

మ - నాబొందిలో వూపిరివుండగా ఆపనిజరగదు. దానికి యింట్లో స్థానంలేదు.

దా - [మండలింపుగా] మధూకి

మ - (విస్తుక) నాన్నా.

# లక్షాధికారి

## 2 వ రంగము

(బజార్లో ప్రకాశం తదితర స్నేహితులు రచ్చబండ దగ్గర ఆడుతూ పాడుతూ ఉంటారు)

ప్రకా --(సాకి) ఈ లోకంలో జరిగే వింతలు వినండీ.
తీరు తారులేని జనుల చేష్టలు కనండీ......

ఒకడు - హాయ్.

ఆందరు - వినండి! కనండి! వున్నారండి
మాయదారి లోకంలో వింతమనుషులున్నారండి!

ప్ర - డాబుసరిగ వేషమేసి డాబులు కొట్టేవారిని
జేబుచూడ నూన్యమైన జనులంతా మెచ్చుతారు
డాబూదర్పము లేక మనసిచ్చే వారిమాట
చెవిలినైనాపట్టరు, చేరనైన చేరనీరు- వున్నారండి-

రెండోవాడు - చదువులనే పేరుతో పట్టాలకు పరుగెత్తి
కట్నాలకు చేయిజాచి కాలరెత్తి తిరుగుఘనులు

ఒకడు - కట్టుకున్న పెళ్ళాన్ని కన్నెత్తయినా చూడక
కనుపించిన ఆడదాన్ని కన్నుగీటు పురుషులు

ప్ర - [కళ్ళుతేలేసి వళ్ళువిరిగించి] ఆ!

రెండో వాడు — ముడిపెట్టిన భర్తను మునువున్న తలవకే
పరపురుషుని సుఖముకోర వరుగులెత్తు మగువలు— ॥వు॥

మూడోకడు — ఏమిటేమిటి? [చిమ్‌చిమ్ వస్తాడు]

ప్ర— ఏడాది పొడుగునా పండించే దొరకైతె
ఎక్కడ కక్కడమింగి కూర్చుండే దొరరండి

కర — [కూరలనంచీ పట్టుగువస్తూనే] బలే బలే! యింకా
యింకా! [చలమయ్య అటుూవెడుతూంటాడు]

ప్ర — పేదల పొట్టలుకొట్టి నిలువచేశే పసినిగొట్టు
నెత్తిన చేతులుపెట్టి మట్టముచేశేవారు వున్నారండి
చలమయ్య వళ్ళువిగించి ప్రకాశం తదితరుల్ని చూసి
గబగబా పెడతాడు అంతా నవ్వుతారు]

అందరూ — ఏయింట్లోచూసినా బూటకమే
ప్రతివాడూ పాడేది ఆడేది నాటకమే వున్నారండీ

మిస్టర్ చిమ్‌చిమ్ — ఏమోయ్ ప్రకాశం! పైలావచ్చినను
మీరుండే వ్యవహారం మొత్తానికి నువ్వు బాగానేపాడ
తావ్.

ప్ర — (తెల్లబోయి) మీసినిమాలో బుక్ చేసుకుంటారేమిటి?
ఒకడు — అదేమిట్రోయ్! మన చిమ్‌చిమ్‌గారు సినిమా తీస్తు
న్నారేమిటి?

ప్ర — ఆc! అంతా చిమ్‌చిమ్‌మే! అదిసరే! యీమధ్యన ఆసుధ
కొంగు పట్టుగు తిరుగుతున్నారేం చిమ్‌చిమ్‌గారూ!

శర - నీకు తెలియదేమిటి? (ప్రకాశం తెలియదన్నట్లు తల వంకిస్తాడు) సరిపోయె! యిప్పుడు ఇంనిష్టర్ చిమ్‌చిమ్ గారు తీయబోయే సినిమాలో ఆవిడే కథానాయకి వేషం!

మి - (శరభయ్యను అదోలాచూసి ప్రకాశంతో) శరభయ్య మాటలకేంలే అంతా వట్టిది.

ప్ర - అయితే అయిందిలే! మనకు గిట్టుబాటే మాత్రం?

శు - (ఆశ్చర్యంగా) నాకేమీ లేదు

ప్ర - దామోదరం చలమయ్యగార్ల మధ్యన చెడిందటగా.

మి - చెడితే?

ప్ర - వాళ్ళు ఆడిందిఆట పాడింది పాట!

శ - (హేళనగా) అందులో తమరికి వాటా!

మి - వాటా? (రెండు గుటకలేస్తాడు)

ప్ర - మధ కొంగుపట్టుగు తిరిగే పెద్దలకు ఆమాత్రం వుండ కుండా వుంటుందా? [నవ్వి] నువ్వు చెప్పకపోయినా మాకు తెల్సులేవయ్యా.

మి - ఏం తెల్సునేమిటి?

శ - ఆవిడగార్ని పెళ్ళిచేసుగోటానికి అయ్యగారు నిరాకరించారు! అసలుబాబే మాట వినంది నన్నేం చెయ్య

మాటావని పెద్దబాబుగారు తప్పుకున్నారు. అందుకు చెలమయ్యగారు చిందులు త్రొక్కటం.

ప్ర - మీరు అండగావుండి పనిచేస్తున్నట్లు నటించటం! యెవరి దగ్గర పాడాల్సినపాట వాళ్ళదగ్గర పాడేఅలవాటు మనకు పుట్టుకతోనేవుంది. కాని ఒకసలహా యిస్తున్నాను. యేదో విధంగా వీలుచేసుకొని సందులో సందు ఆమూడు ముఖ్యేకూడా వేశేయ్! యీరూపంలో నన్నా ఒక యింటివాడివవుతావు! అదికూడా యేమంత పత్నివత కాదులే.

మి - ఆఁ! (శరభయ్య ప్రకాశంలను చూస్తాడు)

శ - [హేళనగా] శరక్టూ.

ప్ర - ఒకవేళ పెళ్ళికి వప్పుగోదనుకో! ఒకచూవన్నా చూడంది విడిచిపెట్టకు

మి - (పరాకుగా) అందుకే వేస్తున్నా ట్రిల్స

ప్ర - అసలే అది పోరంబోకు! దానికోసం పెద్దట్రిల్స వేసే వాడివి నువ్వేం పురుషుడవయ్యా! (అంతా నవ్వుతారు. మిస్టర్ చిమ్‌చమ్ కంగారుగా గుటకలు మింగుతూ గబ గబా వెడతాడు) వాళ్ళఎత్తులు మనకి తెలియవను కుంటున్నారు (వెనక్కి తిరిగిచూసి) అదిగో సుధ. మీరంతా వెళ్ళండి! ఊఁ! (అంతా గబగబా వెడ

తాను. సుధ అటునుంచి వెడుతూ ప్రకాశంనిచూసి వేగంగా వెళ్ళబోతుంది) ఓ! సుధ.

సు - [ఆగి] ఏం?

ప్ర - ఒకమాట!

సు - ఏందాచావ్ మాట.

ప్ర - మాటలు వుంటేనేగానీ మాట్లాడే స్థితిలో లేవా? ఎందాక ప్రయాణం?

సు - నీతో చెప్పాల్సిన పనేమిటి? కనపడ్డప్పుడల్లా పలకరించద్దని ఎన్నిసార్లు చెప్పాను.

ప్ర - పగలు కొంగట్టుకు లాగుతేలేదుగాని రాత్రిపూట కన్ను కొడితే తంటావచ్చిందన్నట్లు వెంటేసుకు తిరుగుతే తప్పులేదుగానీ పలకరిస్తే తప్పొచ్చిందా?

సు - ఏమిటి నువ్వనేది?

ప్ర - ప్రస్తుతంలో నీమోజుకి రాజు......

సు - చాల్లే కట్టిపెట్టు నీరౌడీ వేషాలు నాదగ్గరకాదు.

ప్ర - ఒకప్పుడు యీరౌడీ కౌగిట్లోనే రాణిగా తులికిన సంగతి నువ్వు మర్చిపోయినా నేను మర్చిపోలేదు! మనం ఒకరితో ఒకరు మాట్లాడక పోయినా ఒకరినొకరు తప్పించుకు తిరుగుతున్నా వచ్చిన మచ్చమాయదు. నేను

కంటపడిన వాళ్ళందరితోనూ చెప్పకామానను నువ్వు చేసిన ద్రోహాన్ని......

సు – ఏమిటా ద్రోహం?

ప్ర – నీకు తెలియదూ! పెళ్ళాడతానని నమ్మించి నీ బాబు నవ్వ కోలేదన్న సాకును అడ్డంపెట్టుకొని మనమధ్య సంబంధంలేనట్లు బొంకడం ద్రోహంకాదా? [నవ్వి] ఆఖరి సారిగా చెప్తున్నాను. ఇచ్చినమాట ప్రకారము పెళ్లాడతావా సరేసరి! లేదా జరగబోయేది చెప్పించటం కంటే వూహించటం మంచిది.

సు – నిన్ను పెళ్ళాడటానికి మానాన్న ఒప్పుకోడు.

ప్ర – మధు చేసుకుంటానని మాటిచ్చాడా?

సు – అది నీకెందుకు?

ప్ర – ఎందుకైనా తెలియటం మంచిదికాదూ? అయినా పట్నంలోనే మన బండారం పసికట్టిన మధు నిన్ను ఎలాచేసుకుంటాడులే! స్నేహితుడు అని దామోదరంగారికి అభిమానమున్నా మధు బాబుకి వుండద్దూ? నిష్కారణంగా ఆనారాయణ రాధమ్మలతో తగాదా పెట్టుకుని తాను అనవసరంగా వీధినపడ్డాడుగాని తనుకాదంటే మాత్రం బంధుత్వం యేమవుతుంది? రాధను మధు విడిచిపెడ్తాడా! యేమందో మాకోపెట్టి మనస్సు మార్చటానికి మీ తండ్రీ కూతుళ్ళు తయారయినా మీ

దరిగాచారం బయట పబ్లిసిటీ చేయటానికి మనం సిద్ధం గా నేవున్నాం! (బీడీ వెలిగిస్తాడు)

సు - అల్లరిచేసి నాజీవితం పాడుచేయ దల్చుకున్నావా?

ప్ర - నమ్మించి నువ్వు పాడుచెయ్యాలా నాజీవితాన్ని!

సు - అంతేనా?

ప్ర - కాదా మనంచెప్పినపని చెయ్.

సు - పెళ్ళాడటం మినహా యేంచెయ్యమన్నా చేస్తాను.

ప్ర - పెళ్ళి కాదంటే?

సు - అప్పుడే చేద్దుగాని యీ ప్రచారం.

ప్ర - అయితే యిలారా! (సుధ సమీపిస్తుంది! ప్రకాశం రహస్యంగా యేదో చెప్పి చిన్నగా నవ్వుతూ) సమ్మతమేనా

సు - (అనుమానాస్పదంగా) సాధ్యపడుతుందా?

ప్ర - పడితేనే ప్రయోజనం! (మీసం సవరించుకుంటాడు) ప్రచారంవుండదు

సు - (క్షణం యోచించి) సరే! వస్తా! (గబగబా వెళ్ళింది. సుధ వెళ్ళేవరకూ అటేచూసి ప్రకాశం మీసం సవరించుకుంటూ సన్నగానవ్వి బీడీ వెలిగిస్తాడు. క్షణం ఆలోచించి యేదో గుర్తుకొచ్చినట్లు మొహంపెట్టి చిటుకేసి వెనక్కితిరిగి గబగబా వెడతాడు మధ్య తెర ప్రక్కకు తొలుగుతుంది. అది నారాయణ యింట్లో

పూజామందిరం రాధ మందిరంముందు కూర్చొని పాడుతూ విగ్రహానికి హారతి యిస్తుంది)

రా - (సాకీ) హే తిరుపతి వెంకట రమణా!
మా కులపతి కరుణా ధామా!......

(చరణం) దయగనవా - దేవ దేవ
దయామయా - వెంకటేశా ॥దయ॥

నీపదములనే నమ్మితినయ్యా
నీపూజలనే కోరితినయ్యా
మొరవినరావా మోహనరూపా
కాపాడగలేవా కరుణాధామా ॥దయ॥

జాలిగుండెల ఏడుకొండలవాడ
పాలింపవయ్యా పతితపావన
ఆలింపవయ్యా మా మొర
కరుణించి రావయ్యా కరుణామయ ॥దయ॥

(హారతి యిస్తుండగా బయటనుండి మధు వస్తాడు. రాధ అతన్నిచూసీ చూడనట్లు అభినయిస్తు లోపలకు వెళ్ళబోతుంది)

మ - రాధా!

రా - (ఆగి వక్రంగాచూస్తూ) ఏం? మళ్ళీ ఎందుకొచ్చావ్?

మ - రాకూడదా?

రా - అదేగా మీనాన్న అభిప్రాయం.

మ - నేను కోరేది ఆ పసుకొండలవాడి అభిప్రాయం.

రా - పరిహాసానికి యిది సమయంకాదు. మీనాన్నకు యిష్టం లేనప్పుడు రాకుండా వుంటేనే మంచిది.

మ - అంతేనా?

నారా - (బయటనుండి వస్తూనే) అత్తయ్యనగలు వద్దన్న కొద్దీ బలవంతాన దానిమెడలో వేయటం దేనికి యితరుల మాటల్ని ఆధారంగా తీసుకొని నగలు తిరిగి తీసుకోటం దేనికి? యింటికి రావద్దుట, రావద్దూ రానంత మాత్రాన మేము బ్రతకలేమనేగా!

మ - (విస్మయ స్థాయిగా) నారాయణా.

రా - నువ్వు బాధపడటానికి వాడు కల్పించి చెప్పిందేమీలేదే అంతా నీసమక్షంలోనే జరిగింది

మ - అందుకని?

రా - మామయ్య చెప్పినట్లు చేయటమే మంచిది.

మ - సలహా యిస్తున్నావా?

నా - వచ్చిన కలహానికి తోడులేనిది తెచ్చిపెట్టుకో కుండాను.

మ - మానాన్న మీఅమ్మకు చేసిన వాగ్దానం గుర్తుందా?

రా - వుండే యీవిధంగా ప్రవర్తిస్తున్నాడా?

మ - నాకు కావలసింది మీ మాట.

నా - ఆయనకు యిష్టంలేకుండా నే పెళ్ళాడతావా?

మ - తప్పేముంది.

రా - ఎదురుతిరిగే ధైర్యం వుండద్దూ?

మ - నానిర్ణయాన్ని చెప్పేవచ్చాను.

నా - ఏమని?

మ - రాధనుతప్ప యెవర్నీ పెళ్ళాడనని.

రా - వప్పుకున్నాడా?

మ - వప్పుకోక చేశేదేముంది? యిచ్చాలే నిన్ను యింటికి తీసుకు రమ్మన్నాడు.

నా - అంత తేలిగ్గానా? (అనుమానిస్తాడు)

మ - ఇందునుగురించి అనుమానించకు నారాయణా! నామాట వినికండి యింటికిపోదాం! జీతాలుమారి నక్కలు వేసిన యెత్తులు నాన్నదగ్గర పనిచేసినట్లు నాదగ్గర పని చెయ్యవ్ నేనెప్పుడూ మీవాడినే

నా - అని నువ్వంటావ్. నాలో అనమ్మకం కల్గటల్లేదు.

మ - ప్రమాణంచేసి చెపుతున్నాను. [రాధను మందిరంముం దుకు తీసుకెళ్ళి] నేను రాధనుతప్ప యెవరినీ పెళ్ళా డను. (రాధ సిగ్గుపడుతుంది)

నా - (చిరునవ్వుతో) చాలు మధూ చాలు! యింక నాకు యేఅనుమానంలేదు. యింతకంటే ఆనందమూ లేదు.

మీరిద్దరూ హాయిగా, ఆదర్శ దంపతులుగా రోజులు
గడపండి! హృదయ పూర్వకంగా ఆసీర్వదిస్తున్నాను.

మ - [సమీపించి] రాధా! (నారాయణ లోపలకు వెడతాడు)

రా - ఏం? (ప్రశ్నగాచూస్తుంది)

మ - యిలారా.

రా - ఊహు!

మ - ఇదేనా యింటల్లుణ్ణి మర్యాదచెయ్యటం?

రా - అర్థమయ్యేలా చెప్పటం మంచిది.

మ - చెప్పకుండా తెల్సుకుంటేనే వుందిఘనత

రా - తెల్సుకుంటే బహుమానం యిస్తావా?

మ - యివ్వకుంటే వూరుకుంటావా?

రా - ఏమిటది? (అర్థంకానట్లు చూస్తుంది)

మ - ఇది! [ముద్దుపెట్టుకో బోతాడు]

రా - ఊఁ! [తప్పించుకు పాడుతుంది]

రా - ఓహో! తెలిసెనుగా

ఆహా! తెలిసెనుగా [ఓహో]

ఆవలవులోని సరాగం

ఆపిలుపులోని అనురాగం
ఆకులుకులోని శృంగారం
మదిలో మాయని మమకారం ॥ఓహో॥

మనదె అనురాగపు జంట
లేదిక వేరే ఒకతంట
వేసువేరు పేచీలే లేవంట
మన జీవితమే ప్రేమపంట ॥ఓహో॥

మనమంటే ఓర్వలేరు
మనకేలా వారిగోలా
మనకిల సాటిఎవరు?
మనకు మనము సాటిగ ॥ఓహో॥

మ - (ప్రయత్నించి రాధను పట్టుకొని దగ్గరకు తీసుకుంటూ కొంటెగా) యిప్పుడెక్కడికి పోతావ్? [బయటనుంచి చలమయ్య వస్తాడు]

రా - (చలమయ్యను చూడకుండానే మధునిచూస్తూ ఎక్కిరింపుగా) యిప్పుడెక్కడికి పోతావ్? [హేళనగా] అంతా ఆతండ్రిపోలిక [చలమయ్య పొడిగా దగ్గుతాడు మధు రాధలు విడిపోతారు]

మ - పెద్దలు యేదో పనివిూదనే వేంచేసినట్లున్నారు.

చ - రావలసిన అవసరంవుంది కనుక- నారాయణ యెక్కడ?

మ - వాడితో పనుందేమిటి?

చ – పరిహాసానికి యిది సమయం కాదు.

రా – ఇతిహాసం రేమిటో శెలవియ్యండి.

చ – ఇల్లుస్వాధీనం చేసుగోటానికి వచ్చాను.

మ – ఎందుకు.

చ – శాకీపెట్టి తనఖా వ్రాసినందుకు

మ – ఎవరు?

చ – నారాయణ తండ్రి కనకయ్య

మ – ఏది తనఖావత్రం

చ – ఇదిగో! [చూపిస్తాడు]

మ – (తనఖావత్రం ఆసాంతం చదువుకొని అదోలా చల
మయ్యేట్టు చూస్తూ) ఊఁ!

చ – నిముషాలమీద యిల్లు, యింట్లోవున్న చరాస్తీ స్వాధీ
నం చెయ్యాలి

మ – నిరభ్యంతరంగా చేసుగోవచ్చు

రా – (పెద్దగా) పిల్లేదు.

మ – (ఆదుర్దాగా) రాధా.

సా – (లోపలనుంచి వస్తూనే చలమయ్యను అదోలా
చూస్తాడు)

రా - అన్నయ్యా! (నారాయణ ప్రక్కన నిలబడుతుంది) యిల్లు స్వాధీనం చేసుకోటానికి వచ్చారు.

నా - తెలుస్తూనేవుంది. ముందుగా మధురావటంలో అంతరార్థం ఆదేశనికూడా గ్రహించాను.

మ - (స్థాయిగా) నారాయణా!

నా - కాదా? యిందులో నిజోక్త్వం లేకపోలేదు. అయినా వచ్చిన భయంలేదు. అంతమాత్రాన అవవలసిన పనులు అవకమానవు

చ - ఏమిటయ్యేది?

నా - అడుగు ముందుకి వేస్తే అక్కడే బలిపరుకుతాను.

చ - నరకటం అనుకున్నంత తేలిగ్గాదు.

నా - తేరగా వున్నారని బెదిరించటమే తేలిక

మ - నారాయణా! నువ్వెనన్నిష్టి అనుమానించావన్న బాధ నాకులేదు. కాని పెంచి పెద్దచేసిన తండ్రిపోగా బ్రతికిన వాళ్ళు యిల్లుపోతే బ్రతకలేరా? రెక్కలు చల్లగా వుండాలిగాని రేపీపాటికి యింతకంటే మంచియిల్లు కట్టించుకోవచ్చు (చేతులు పట్టుకొని) నామాటవిను నారాయణా!

నా - ఇతన్నల్ని అడ్డంపెట్టుకోకుండా మీనాన్నే స్వయంగా వచ్చి స్వాధీన పర్చుగున్నట్లయితే తప్పకుండా వినే వాణ్ణి!

సు - అంటే నాకు అర్థంకావట్లేదు.

నా - తనకొప్పైకం యిచ్చింది మీనాన్నేనని నీకు తెలియదా?

మ - తెలిసి చేశేదిలేదు. తనఖాపత్రం చలమయ్య పేరనుంది.

చ - అవును యిల్లునాదయి తీరాలి.

నా - డబ్బుపీది కసాకనా యిల్లు నీదవటానికి! నీజీవితంలో ఒక్కసారిగా అయిదువేల రూపాయలు మొప్పాతన్నా చూశున్నావేమో గుండెలమీద చేతులు వేసుకొని చెప్పు. దామోదరంగారి మోచేతిక్రింద నీళ్ళు తాగి బ్రతుకుతూ ఆయన అండతో తలెత్తుగు తిరుగుతున్న నీబండారం నాకేకాదు. యీవూళ్ళో పసిపిల్లలకు సైతం తెల్సును.

చ - అవన్నీ అనవసరం ముందు కట్టుగుడ్డలతో బయటకి నడవాలి.

నా - సిబాబు దిగిరావాలి.

చ - ఎవరిబాబు దిగొచ్చేదీ కనబడుతుంది (చప్పట్లు కొడతాడు బయటనుంచి యిద్దరు కూలీలు మీసం మెలివేస్తూ వస్తారు) వాళ్ళయిద్దర్నీ బయటకు యీడవండి.

నా - (కర్రచూపిస్తూ) దమ్ముంటే యీడవండిరావచ్చి-

రా - (ఆదుర్దాగా) అన్నయ్యా

మ - [ఆదుర్దాగా] నారాయణా!

రా - పోనీలే అన్నయ్యా! వాళ్ళకు అభ్యంతరం చెప్పకు యిల్లుపోతే పోయింది అన్నిటికీ తెగించిన ఆ చలమయ్యతో మనకెందుకు పేచీ

నా - నీకు తెలియదు రాధా! యిటువంటి వాళ్ళకు జీవితంలో మరువరాని గుణపాఠం చెప్పాలి అప్పటికిగానీ వీళ్ళకు బుద్ధిరాదు.

చ - ఆబుద్ధి చెప్పటానికే నేనూ సిద్ధంగావున్నాను. (కూలీలను చూస్తూ) చవటల్లాగా నిలబడి చూస్తారేరా వెధవల్లారా! ఊఁ!

నా - (ముందడుగు వేయబోతున్న కూలీలను చూస్తూ) అడుగు ముందుకు వేశారా రక్తపుటేరు ప్రవహిస్తుంది.

చ - ఆప్రవాహాన్ని చూడాలనే నేనూ వుబలాట పడుతున్నాను.

మ - నామాట వినదల్చుకోలేదా నారాయణా

నా - వినటం. యీవిషయంలో [నవ్వి] ఎప్పటికీ జరగదు.

చ - [బాగా ఆవేశంతో] అనుభవిస్తారు. [కూలీలనుచూస్తూ] ఊఁ! [కూలీలు రెండు అడుగులు వేస్తారు బయటనుండి దామోదరం వగరొస్తుకుంటూ ఆగండి అని వెర్రిగా అరుస్తూవస్తాడు. నారాయణ దామోదరంకేకవినిపించుకోకుండానే కర్రతో కూలీలను కొట్టబోతాడు.

కూలీలుకూడా కర్రలు ఎత్తుతారు. మధు వాళ్ళను ఆపటానికి ప్రయత్నిస్తుంటాడు. రాధ కంగారుపడుతుంది చలమయ్య మీసం సవరించుకుంటూ చిన్నగా నవ్వుతూ నిలబడతాడు. దామోదరం 'ఆగండి' అని మళ్ళీ గట్టిగా అరుస్తూ అడ్డొవస్తాడు నారాయణ బలంగా చూడకుండా దామోదరం తలమీదకొడ్తాడు దామోదరం 'అబ్బ' అని బాధపడుతూ నేలమీద కూలబడతాడు. అతని తలనుండి రక్తంకారుతూంటుంది. చలమయ్య నవ్వుతాడు యెక్కడవాళ్ళు అక్కడ ఆగిపోతారు)

దామో - (తలపట్టుకొని) అబ్బా

మ - (ఆదుర్దాగా) నాన్నా.

రా - (ఆదుర్దాగా) మామయ్యా (చేరొక ప్రక్క నా కూర్చుంటారు. రాధ రక్తంతడిచి పమిటచెంగు చించి కట్టుకడుతూంటుంది. మధు నాడివగైరాలు పరీక్ష చేస్తుంటాడు, నారాయణ ప్రక్కకు తప్పుకొని నిలబడతాడు)

చల - (అవేమీ లెక్కచేయకుండా కూలీలనుచూస్తూ) ఊఁ! నిలబడ్డారేరా వెధవల్లారా? (కూలీలు ముందుకి వెళ్ళబోతారు)

దా - (వాళ్ళను ఆగమన్నట్లు సైగచేసి చలమయ్యను అదోలా చూస్తూ) చలమయ్యా! స్నేహితుడుగా నమ్మానును ప్రక్కలో బల్లెమై యీవిధంగా ప్రవర్తిస్తావని అనుకో

లేదు తనఖామీదడబ్బు నేను యిచ్చానన్న సత్యం నీకూ తెలుసును. తనఖావత్రం నమ్మి నీపేర వ్రాయించిన దానికేగా పరిస్థితి యింతవరకూ తీసుగొచ్చావ్. నీమాటఃబవిని అయినా వాళ్ళను వదులుకోటానికి కూడా సిద్ధమయ్యాను. గుంభణగా వుంటున్న సంసారాన్ని వీధికి ఎక్కించి యింతరాద్ధాంతం చేశావ్. వీటి అన్నిటికీ కారణం నీకూతుర్ని చేసుగోటానికి మధు అంగీకరించక పోవటం. వాడికి యిష్టంలేని పెళ్ళి చేయటానికి నేను నిరాకరించటమూను జట్టుచేశకిచ్చి చింతిస్తే ఫలితం యేముంది? అయిదువేల రూపాయలూ వడ్డీతోసహా యెంతయిందో చెప్పు! ఆసొమ్ము నేనిస్తాను

చ – వడ్డీతోసహా మొత్తం ఆరువేల రెండువందల యాభై మూడురూపాయల పావలా. అదేదో వెంటనే యివ్వాలి.

దా – మధూ! (యినప్పెట్టె తాళాలుయిచ్చి) యింటికి వెళ్ళి యినప్పెట్టెలో ఆబాకీ పైకం పట్టుగురా.

మ – (తాళాలు అందుకొని) రాధా! నాన్నను జాగ్రత్తగా చూస్తూవుండు! నేనువచ్చేసరికి కొంచెం వేణ్ణీళ్ళుపెట్టి వుంచు నారాయణా! (యేదో చీటీవ్రాసి) బజారుపోయి యీ యింజక్షన్ బాటలు తీసుగురా! (అయిదు రూపాయల కాగితం యిస్తాడు. బయటినుండి సుధవస్తుంది. రాధ లోపలకు వెడుతుంది. మధు చలమయ్యను

చూస్తూ) రావయ్యా పైకం యిస్తాను. (మధు నారాయణ బయటకి వెడతాడు)

సు - వెళ్ళకండి నాన్నా! (కూలీలు బయటకి వెడతారు)

చ - సుధా! (అర్థంకానట్లు చూస్తాడు)

సు - అవును నాన్నా! పైకం యిచ్చింది దామోదరంగారు అయినప్పుడు వారికి వ్యతిరేకంగా వసూలు చేయటం పొరపాటు! అందువలన వచ్చే అనర్థాలు వూహించారా చాలాకాలంగా మీయిద్దరిమధ్యనా వున్న స్నేహం యిందుమూలంగా పాడుచేసుకుంటారా. (కనుసైగ చేస్తుంది)

చ - (అర్థం చేసుకున్నట్లు అభినయించి) అదికాదమ్మా! నేను మాత్రం అంతకతెలియంగా వుంటానా! మేమిద్దరం స్నేహితులమనేగా వసూలు చేయటం అయిన వాళ్ళని అడగలేని మొహమాటం అడ్డం వుండబట్టేగా ఆనాడు నాపేర తనఖా వ్రాయించింది! ఆ మొహమాటం వల్లనేగా యీనాటి వరకూ అడగలేక పోయింది. అందుకే అడబ్బు నేను వసూలుచేసి ఆడబ్బు దామోదరంకి యిద్దామని యింత ఖచ్చితంగా మాట్లాడాను.

సు - అది వాళ్ళకు నచ్చనప్పుడు మీరు తటస్థంగా వూరుకోటం మంచిది! (దామోదరంని చూస్తూ) మా నాన్నను క్షమించండి. పరిస్థితులు ప్రమాదాల వరకూ వస్తాయని వూహించలేక పోవటం నాన్న పొరపాటు.

చ - అవును దామోదరం. తొందర పడ్డందుకు మన్నించు. నావలన నీకు కలిగిన దుర్భర అవస్తకు చాలా చింతిస్తున్నాను. (రెండుచేతులు పట్టుకొని) నన్ను క్షమించు దామోదరం.

దా - (చలమయ్యను అదోలాచూస్తూ) సరే! (నిట్టూరుస్తాడు)

రా - (లోవలనుండి వస్తూనే) రా మామయ్యా! లోపల పడుకొందువుగాని (రెక్కపట్టుగొని లేవదీయ బోతుంది. సుధ సహాయంచెయ్య బోతుంది) నీకంత శ్రమ అక్కర్లేదు. నేను తీసుగు పోగలను. (సుధ నిట్టూర్చి వూరుకుంటుంది. రాధ దామోదరాన్ని నెమ్మదిగా తీసుగు బోతుంది)

చ - సుధా! నీకు తలకాయవుందా?

సు - వుంది కనకే యీఎత్తు వేశాను.

చ - అంటే?

సు - పైకం వాళ్ళుయిచ్చి మీరు తీసుకుంటే మన రెండు కుటుంబాల మధ్యనా రాకపోకలు ఆగిపోతాయ్.

చ - ఆగిపోతె?

సు - ప్రతీకారవాంఛ తీరకుండానే ప్రయత్నాలకు ఆటంకం కలుగుతుంది. అందుకనే వేశాను మరోపధకం.

చ - ఏమిటది?

సు - మనస్సులో వాంచలుతీరటానికి మానష్యుల మధ్యనవుండే నమ్మకాలు పెరగటం అవసరం. రాకపోకలు యథా విధిగా వుండాలి యేకారణాన్నయితే అడ్డంపెట్టి నన్ను తిరస్కరించాడో ఆకారణంతో రాధనుకూడా అనుమానించాలి మధు. ఆ అనుమానంతో మధుజీవితం అంధకారం రాధ బతుకు బజారుపాలు. నారాయణ పొగరుమోత్తనానికి స్వస్తి వున్నపళువాస్తి! మిగిలేది దామోదరం ఆయన యావదాస్తి ఆయనకు తెలియకుండా యెవ్వడో మీగుప్పెట్లో పెట్టాడు. ఆవెంటనే మనం లక్షాధికార్లం! దామోదరం అయిన వాళ్ళతోసహా బిక్షాధికార్లు.

చ - [సంతోషంతో] బలే ఎత్తువేశావు సుధా! (రెండు భుజాలూ పట్టుకొని) అప్పుడే గ్రహించాను నూత్న యేర్పాటుతోనే నువ్వు వచ్చివుంటావని చలమయ్యకు తగ్గ కూతురువి [చిన్నగా నవ్వుతాడు]

సు - దామోదరం గారితో మీారు తిన్నగా యింటికిరండి. అన్నివిషయలూ యింటిదగ్గర తీరుబడిగా మాట్లాడుకుందాం.

చ - ఊఁ! [చలమయ్య లోపలకు సుధ బయటకి వెడతారు]

తెర

# లక్షాధికారి

## 3 వ రంగము

[వీధిలో బిచ్చగాడు పాడుతూ ఆడుతూ వస్తాడు వచ్చే పొయ్యేవారు యెవరికితోచిన ధర్మం వాళ్లువేసి వెళు తూంటారు]

బిచ్చ - చూడండి లోకంలో చిత్రము
వినండి మానవుని మంత్రము ||చూడం||

ఎక్కడి కక్కడ తంత్రం
ఎవరాడిన కుతంత్రం
గిట్టక చేశే నటన
మానవజీవిత ఘటన ||చూడం||

తలకొక కోరిక
కలదొక వేడుక

[చలమయ్య అటునుంచి వెడతాడు]

తీరికతో పెడతారు తంపులు
కోరికతో తీస్తారు కొంపలు ||చూడం||

వున్నవాడికే కరువు
లేనివాడికి కులుకు
కులుకుతున్న పేదవాడి తరముతీసు పోయిగా

కేనువున్న ధనికులకు కలిగేసుఖము లేనుగా ॥చూడం॥
ఒక పక్కనుండి శరభయ్యా మరొక ప్రక్కనుండి మిస్టర్
చిమ్‌చిమ్ వస్తారు)

బిచ్చ – గొప్పలు చెప్పబోకు
తిప్పలు తెచ్చుకోకు
చెప్పేడు మాటలువిని చేయబోకు ఘోరము
ముప్పుకు కారణమేను తీరదు నీభారము ॥చూడం॥

[మిస్టర్ చిమ్‌చిమ్ ప్రముఖులు మోత్తనంతో గబగబా
వెడతాడు శరభయ్యా విరగబడి నవ్వుతాడు]

శర – [బొడ్లోనుండి చిల్లరతీసియిస్తూ] బలేబలే! మాబాగా
పెట్టావు వాత అడుక్కునే వాడివైనా మా ఆసాము
లకు తగిన పాటపాడావ్! నీకెంత యిచ్చినా ఋణం
తీరదు యిం:! [చిల్లర చేతిలో వేస్తాడు. బిచ్చగాడు
మళ్ళీ పాడుతూ వెడుతూంటాడు. శరభయ్యా అటే
చూస్తూ తల ఆడిస్తూంటాడు. వెనకనుండి ప్రకాశం
వస్తాడు]

ప్ర – ఏంశరభయ్యా! గంగిరెద్దులాగా తలమాబాగా ఆడిస్తు
న్నావ్! [శరభయ్యా త్రుళ్ళిపడి ప్రకాశాన్నిచూసి
నవ్వుతాడు] ఏమిటి సంగతి? ఎలావుంది మీదామో
దరంగారికి!

శర – నెమ్మదిగానే వుంది.

ప్ర – మధు పెళ్ళెప్పుడు?

శర - ముహూర్తం పెట్టించారుగా!

ప్ర - ఏఆటంకం లేకుండా జరుగుతుందని ఆశుందా?

శ - అదేమిటి?

ప్ర - ఏరోజుకి యేంజరగనుందో యెవరు చెప్పారు? యెటొచ్చి ఎటుపోయినా మంచిది కొంచెం జాగ్రత్తగా వుండమని మీ బాబుగారితో చెప్పు

శ - మాచింబాబు రాధమ్మను చేసుగోటం చలమయ్యగారికీ యిష్టమేనే!

ప్ర - ఆ యిష్టమే స్పష్టంగా చెప్తోంది. మనస్సులో వున్నకష్టం కొద్దీ యేంచేసినా చేయచ్చని! అంచేత వాళ్ళను అంటే చలమయ్య సుధలను కనిపెట్టు గుండటం మంచిది. అది నీవలనకాదుగాని నువ్వు యింటిని కనిపెట్టుగుండు వ్యవహారం మితిమీరుతుందని నీకుతోస్తే వచ్చి నాకు చెప్పు తర్వాత జరగాల్సిందంతా నేచూసుకుంటాను.

శ - యీమధ్య ఒకచిత్రం జరిగింది తెలుసా?

ప్ర - ఏమిటది? [బీడి వెలిగిస్తాడు]

శ - వున్నట్లుండి యినప్పెట్టెలో నగదు నగలూ మొత్తం తుడ్చిపెట్టుగు పోయినాయ్.

ప్ర - [ఆదుర్దాగా] దొంగతనమా! తెలిసిందిలేవమ్మా

శ - మొత్తం యినప్పెట్టె ఖాళీఅయిపోది.

ప్ర - అయితే అయిందిలే! మొత్తం అంతా చేరవలసిన చోటుకే చేరింది

శ - అంటే నీకూ తెలుసా? [తెల్లబోతాడు]

ప్ర - [భుజంపట్టి నవ్వుతాడు] తెలుసునన్నానయ్యా! సొమ్ము మీద ప్రీతితో ప్రయత్నించింది ఒకళ్ళు ఫలితం పొందింది మరొకరు

శ - తికమకలుగా చెప్పక సరిగా చెప్పవయ్య బాబూ!

ప్ర - చెప్పినా నీకు అర్థంకాదు యిదంతా అదొక రకమైన పద్మవ్యూహం. [చిన్నగా నవ్వి] అదిసరేగాని దామోదరంగారు కంగారు పడలా?

శ - కంగారు మాటెలావున్నా దిగులుతో నిన్నటినుండి వుద్ధరణెడు నీళ్ళుముట్టలేదు సొమ్ము తీసిందెవరో తెలియదు కాని ఆసుధ యేంచెప్పిందో తెలుసా? (ప్రకాశం శరభయ్యను చూస్తాడు) ఆ రాత్రి రెండుగంటల ప్రాంతంలో నారాయణ యేదో మూటపట్టుకు దొడ్డిదార్ని వెడుతుంటే చూశానని చెప్పింది.

ప్ర - (నాలుక చప్పరించి) ఆసమయంలో ఆవిడగారు అక్కడికి యెందుకు వెళ్ళిందో! [నవ్వి] అనుకున్నంతా అయింది!

శ - నారాయణబాబు అటువంటి పనిచేశాడంటే యెవరునమ్ముతారు బాబూ! (ప్రకాశం ఔనన్నట్లు తలపంకిస్తూ యేదో ఆలోచిస్తాడు) యేమిటో అంతా అగమ్యంగా

వుంది [తీసుకొని] వస్తాను ప్రకాశం అవతలవనుంది [వెడతాడు. ప్రకాశం అలాగే నిలబడి యేదో ఆలో చిస్తూంటాడు మధు అటు వెడుతూంటాడు]

ప్ర - డాక్టర్ బాబూ!

మ - [ఆగి అటూ యిటూ చూసి] మనం అనుకున్నది నిజమేనా?

ప్ర - సందేహం దేనికి అంతా నిజమే. దురంతాలు పెరగటం యెంతైనా మంచిది వాడిపిలక మనచేతిలో వుంది. సమయం చిక్కాలిగాని యిటువంటి పెధవ పనులుచేయకుండా పదిమంది పెద్దల్లోనూ బుద్ధిచెప్పనూ? (మీసం సవరించుకుంటాడు)

మ - చలమయ్యంటే అంత తేలిగ్గా తీసెయ్యకు

ప్ర - వాడంటే మీకు అదురుండచ్చు! నేనంటే వాడికే అదురు.

మ - ఎందుకనో?

ప్ర - మీతో యింతవరకూ చెప్పని రహస్యం మాయిద్దరి మధ్యనా వుంది

మ - ఏమిటది?

ప్ర - ఏమయితే యెందుకులెండి! ఆనారాయణ మీదనే దొంగతనం ఖాయమయి పోలీసులు పట్టిగెళ్ళాలి మన

పనివాడతనం చూపించాలి [యేదో గుర్తుకొచ్చినట్లు చూస్తూ] మీరన్నది...

మ - యింకా అనుమానం దేనికి? యేర్పాట్లన్నీ చేసి వస్తున్నాను.

ప్ర - ఇంకేం! (బీడీ వెలిగించి) డాక్టర్ చదువు పూర్తి అయిందా మళ్ళీ పట్నం వెళ్ళాలా?

మ - ఈ సంవత్సరం కోగాని పూర్తి కాదు

ప్ర - ఆసుధకు మీకూ పరిచయం యెలాగలిగింది బాబూ

మ - అది చిన్నప్పటినుండీ వాళ్ళ పినతల్లి గారింట్లోనే పెరిగింది పట్నంలో మా కాలేజీ సమీపంలోనే వాళ్ళున్న యిల్లు. నిజానికి అప్పటికి రాధ మీద నాకు అభిప్రాయం లేదు మనస్సు మంచిదని నమ్మి ప్రేమించాను!...

ప్ర - మిమ్మల్ని ప్రేమిస్తూనే వాణ్ణెవణ్ణో పరిగించా?

మ - ఆఁ! వాడూ నాకు స్నేహితుడే! ఒకసారి యేదో పనుండి వాడి రూమ్‌కి వెళ్ళాను. వాడి కౌగిట్లో యీ కులటకుల కటం స్వయంగా చూశాను.

ప్ర - యీ సమయంలో వాణ్ణి కూడా పిలిపించటం మంచిది. స్నేహితుడే నన్నారుగా! వెంటచేరమ్మని ఉత్తరం వ్రాయండి బాబూ.

మ - వాడెవ్వడో చచ్చాడు.

ప్ర - అందుకే ఆవిడగారు మిమ్మల్ని పట్టాలని చూస్తోంది. యిప్పుడు తెలిసిపోయిందిగా! (నవ్వుతాడు)

మ - కబురు పంపగానే రావటానికి సిద్ధంగావున్నా

ప్ర - చిత్తంబాబూ!

మ - (కట్టువాచీ చూసుకొని) మరి నేవెళ్ళిరానా?

ప్ర - (సరేనన్నట్లు తలవంకిస్తాడు. మధు వెడతాడు ఆతర్వాత చిన్నగానవ్వి కూనిరాగం తీస్తాడు. ఒకవేపునుండి మిస్టర్ చిమ్‌చిమ్ అటు వెడుతూంటాడు) ఏమండో చిమ్‌చిమ్‌గారూ మాజోరుగా పరుగెత్తుతున్నారే! ఏమిటికథ

మి - [వెటకారంగా నవ్వి] పెద్దవనేంలేదు ఒకఫ్రండ్‌ని మీట వాలని వెడుతున్నాను.

ప్ర - దామోదరంగారింట్లో నగలు నగదు పోయి దిటగా.

మి - నీకూ తెలిసిందీ! [నవ్వుతాడు] కరక్టు

ప్ర - దొంగలు దొరికారా?

మి - యింకా లేదనుకుంటా! పోలీసులు దర్యాప్తు జరుపు తున్నారు కరక్టు

ప్ర - మీాకు తీశారట! [శరభయ్యకు వెళ్ళమన్నట్లు సైగ చేస్తాడు]

మి - నేనా? [రెండు గులకలేసి ప్రకాశం నెత్తిన చెయిపెట్ట బోయి] నీమీదొట్టు నేనుకియ్యాలా! (శరభయ్య వెడతాడు)

ప్ర - మరెవరు తీశారంటావు?

మి - సుధ! కాదుకాదు రాధో దాని అన్నో అయుంటావు.

ప్ర - అలా చెప్పు! అందుకే నారాయణంమీద అనుమానముందిట

మి - [బరువు తీరినట్లుగా] మంచిదే [నవ్వి] కరక్టు! మళ్ళీ యిటువంటి వెధవపనులు చేయకుండా రిపోర్టుకూడా యివ్వాలి

ప్ర - ఆవునవును. యివ్వాల్సిందే! పెరటిగోడదూకి పారిపోతుండగా చూసిన వాళ్ళున్నారు.

మి - నేను సుధా కాకుండా యింకా వునారన్నమాట! అయితే యింకేం సాక్షం బలంగానేవుంది.

ప్ర - నువ్వూ సుధాకూడా చూశారా?

మి - మాకళ్ళతో! [గర్వంతో పొడిగా దగ్గుతాడు]

ప్ర - మీరిద్దరూ అక్కడికెందుకెళ్ళారు?

మి - సుధపెరట్లోవున్నాం! యింటిప్రక్కన యిల్లే కాబట్టి గోడదూకటం కనుపించింది.

ప్ర - అర్ధరాత్రి మీరు సుధను కల్సుకోవల్సిన అవసరమేమొచ్చిందో.

కు - [గుటక లేస్తూ భయంగా] వచ్చింది!... కాదు కాదు పిల్చింది అటుపోతుంటే! లేదు లేదు నేనే వెళ్ళాను

ప్ర - [నవ్వి] సొమ్ము పోగొట్టుకున్న వాళ్ళు, అపహరించిన వాళ్ళు యిద్దరూ బాగానేవున్నారు. మధ్య నువ్వు కంగారు పడతావే?

కు - కరక్టు అవతల కొంపదరపనుంది వస్తా! (గబగబా వెడతాడు)

నా - (మిష్టరు రావు వెళ్ళినమార్గం చూస్తూ నవ్వుతూ వుంటాడు ప్రకాశ్ -నారాయణ వెనకనుంచి వస్తాడు) ఏం ప్రకాశం విన్నావా?

ప్ర - విన్నాను. మీమీద విస్సుకు పడబోతోందని భయపడకండి.

నా - ఎందుకుభయం? ఎదటపడి యెవరన్నా అడుగుతే జవాబు చెప్తాను. కాని అంతధైర్యస్థు లెవరూ లేరులే.

ప్ర - లేకపోయినా మీరు మెళుకువగా వుండటం మంచిది.

నా - ఎందుకు?

ప్ర - చెప్తానురండి బాబూ! చేయాల్సిన తతంగం చాలావుంది రండి బాబూ! (నారాయణ రెక్కపట్టుగు తీసుకు పోతాడు మధ్య తెరప్రక్కకు తొలుగుతుంది రంగాలం

కరణమంతా మొదటిరంగం మాదిరేవుంటుంది దామోదరం పడకకుర్చీలో కూర్చొని ఠెవ్వరూల్చకుండా యేదో ఆలోచిస్తుంటాడు రాధ సమీపాన క్రిందచాప మీదకూర్చొని భాగవతం చదువుతూంటుంది)

రా - అనియే (కూనరాగంతీస్తూ పేజీలు తిరగేస్తుంది)

పద్యం॥ ఆ॥ జగదుద్భవంపున
రైవతుఁడను రాజుదెచ్చి రామునకిచ్చెన్
రేవతియనియెడు కన్యక
భూవర మనువిఁటిగాదె బుద్ధిందెలియన్॥

అనంతరంబు-

[పద్యం] ఖగనాథుండ మరేంద్రుగెల్చి సుధమున్
గైకొన్న చందంబునన్
జగతీ నాథు లజైద్యపతుచయులన్
సాళ్వాదుఁన్ గెల్చి భ
ద్రగుఁడై చక్రివరించె భీష్మకసుతున్
రాజీవ గంధిన్రమా
భగవద్యంశ భవన్ మహాగుణమణిన్
బాలామణిన్ రుక్మిణిన్॥

అని రాజయిట్లనియె! మున్నురాక్షస వివాహంబున స్వయం వరంబునకుం వచ్చిన హరి రుక్మిణింగొని పోయె నని పలికితిప కృష్ణుండెక్కరుండెవిధంబున సాళ్వాదులం జయించి తన పురంబునకుంజనియే! (శరభయ్య

పాలగ్లాసుతెచ్చి రాధకుయిస్తాడు) అంత (గ్లాసుఅందు కొని దామోదరానికి అందిస్తూ) పాలుతీసుకో మామయ్యా!

దా - (గ్లాసు అందుకొని శరభయ్యనుచూస్తూ యేదో ఆలోచనతోనే) పెంటయ్య కొబ్బరికాయలు కొట్టా అయిందా? (పాలు త్రాగుతాడు)

శ - అయింది మొత్తం నూటయాభై కాయలున్నాయండి. (దామోదరం ఖాళీగ్లాసు అక్కడపెట్టి అప్పుడే బయట నుంచి వచ్చిన చలమయ్యను చూస్తాడు శరభయ్య ఖాళీగ్లాసు తీసుకొని లోపలకు వెడతాడు రాధ చదువుతున్న భాగవతం మూసి కళ్ళకద్దుకొని పుస్తకంతో సహా లోపలకు వెడుతుంది)

దా - ఏమైంది చలమయ్యా!

చ - మనంచేయటానికి సాహసించలేనిపని నారాయణ చేతిమీదగా జరిగింది.

దా - ఏమిటావని?

చ - నగలు నగదు పోయినట్లు రిపోర్టు చెయ్యటం.

దా - ఎందుకీ రిపోర్టుకూడా! (నిట్టూర్చి) యితనులు తాకట్టు పెట్టిన నగలన్నీ అందులోనేపెట్టాను. కనీసం అవిదొరికినా బాగుండును పసుపు నిలుస్తుంది! లేదా నన్ను లోకులు బ్రతకనివ్వరు.

చ - అందునుగురించి నువ్వేం భయపడనవసరంలేదు. నామీాదొదిలెయ్.

దా - [నిట్టూర్చి] ఊఁ!

చల - ఒకసారి అలావెళ్ళొద్దాం వస్తావా?

దా - ఎందుకు?

చ - చెప్తానుగా.

దా - (అనుమానంగా చూస్తాడు)

చ - బయట్లేసి చెప్తాను

దా - పద (కుర్చీలోనుంచిలేచి చలమయ్యతో వెడతాడు మరో రెండునిముషాల అనంతరం సుధ బయటనుంచి వచ్చి వెనకవస్తున్న మిస్టర్ చిమ్‌చిమ్‌ని రమ్మని సైగ చేస్తుంది. లోపలనుండి శరభయ్యవచ్చి సుధనుచూసి ప్రక్కకు తప్పుకుంటాడు)

సుధ - [తనలో] సుధ కులట! రాధ పతివ్రత! మధునే నమ్మింది. (చిన్నగానవ్వి) ఆనమ్మకంయీా ప్రయత్నంతో సమాప్తికావాలి! రాధ ప్రజాదూషణకు కారకురాలు కావటమే సుధ కోరేది (చిన్నగా నవ్వుతుంది మిస్టర్ చిమ్‌చిమ్ వస్తాడు) శరభయ్య రాధలమధ్య (చిన్నగా నవ్వుతుంది)

మిస్ట - యీాపనిచేస్తే నన్ను పెళ్ళాడటం ఖాయమేగా?

సు - ముందు ముగించు! కార్యసాధన కాగానే నీవు కోరకుండానే యీాసుధ... [ప్రేమగా చిమ్‌చిమ్‌ని చూస్తుంది]

మి - (ప్రేమగా) నన్నే పెళ్ళిచేసుకుంటావ్. కరక్టు! (నవ్వ బోతాడు సుధ, చిమ్‌చిమ్‌నోరుమూసి ఒకపువ్వు అతనికి అందిచ్చి బయటకి పంపుతుంది)

సు - (తనచేతిలో పువ్వుచూసుకొని చిన్నగానవ్వి అటూ యిటూ చూస్తుంది. శరభయ్య లోపలకు వెడతాడు) ఎవరూ లేనట్లున్నారే.

రా - [లోపలనుంచి వస్తుంది]

సు - మీరూ మీరూ యేకమైనా నామీదున్న కోపం పోలే దల్లే వుందే.

రా - ఎందుకు కోపం?

సు - [భుజాలమీద చేతులేసి] లేకపోతే యిదివరకులాగా మాట్లాడవేం? [రాధ అకోలా సుధనుచూసి చిరునవ్వుతో "ఊం!" అంటుంది] ఆ! అది! (నవ్వి) అన్నట్లూ నీకు గులాబీ పువ్వులాటే బాగాయిష్టం కాదూ?

రా - నీకూ యిష్టమేగా!

సు - (తనచేతిలోవున్న పువ్వువాసనచూస్తూ) యీపువ్వు చూడు యెంత పెద్దదో! వాసనకూడా చాలాబాగుంది.

రా - అలాగేం? (నవ్వుతుంది. సుధ తనచేతిలోవున్న పువ్వు రాధకు యివ్వబోతుంది మిస్టర్ చిమ్‌చిమ్ బయట నుంచి పువ్వుతో వస్తాడు)

మి - (నవ్వి) మీపువ్వు మీరేవుంచుగోండి. రాధకు యీపువ్వు యిస్తాను (వాసనచూడబోయి యేదో గుర్తుకొచ్చి వూరుకుంటాడు)

సు - ఉహూ! నేనేయివ్వాలి (రాధకు యిస్తుంది)

రా - (వాసనచూసి) అబ్బ! ఒలేవాగనగావుంది. (అక్కడున్న కుర్చీపీటమీద మధ్యన పడేస్తుంది)

మి - (వెకిలిగానవ్వి) కరక్టు! యీ నాపువ్వు, అబ్బో! అంత కంటే ఘుమాయిస్తుంది! (రెండడుగులేసి తనే వాసన చూసి మైకంలోతూలి మంచంప్రక్కనే కూలబడి శవం లాగా మంచంకోటికి చేరగిలబడతాడు. రాధ మిస్టర్ చిమ్‌చిమ్ చేతిలో పువ్వుఅందుకొని మొదటిపువ్వు పడేసిన కుర్చీపీటమీద అంచున పెడుతుంది)

సు - (కంగారుతో) ఆఁ! అదేమిటి? (మిస్టర్ చిమ్‌చిమ్ భుజం పట్టుగు కదిలిస్తుంది ఆసమయంలో రాద తెలివిగా పువ్వుల స్థలాలు మారుస్తుంది) ఆడవాళ్ళను చూస్తేసరి యీమగవాళ్ళకు అమాంతంగా ఫిట్సువచ్చి పడతాయ్.

రా - (అదోలాచూస్తూ) పువ్వులో యేమన్నా వుందేమో!

సు - (వెటకారంగా) పువ్వులోకాదు ఆజబ్బు మనిషిలోనే వుంది.

రా - అంటే నమ్మను. అదేదో పువ్వులోనేవుంది.

సు - నీ అనుమానానికి అర్థంలేదు. అంత అనుమానంగావుంటే నేను వాసనచూస్తాను చూడు. (పువ్వుల స్థలాలు మార్చి నట్లు తెలియకపోవటం వలన పీటమధ్యనున్న పువ్వు అందుకొని వాసనచూస్తుంది. చేతిలోపువ్వు జారి పడుతుంది సుధ తూలి క్రిందపడుతుంది. లోపలనుంచి శరభయ్య వస్తాడు. క్రిందపడ్డ పువ్వును అందుకొని దాన్నిచూస్తూ విరగబడి నవ్వుతుంది రాధ)

శ - ఆపనికోసమే వాళ్ళొచ్చింది చెప్తే మీరునమ్మలేదు. సమయానికివచ్చి విన్నాను కనుక సరిపోయింది. లేకుంటే అనుకున్నంతా అయ్యేది.

రా - ఏమనుకున్నావ్?

శ - వాళ్ళువచ్చి మీకిచ్చినదే అందుకు! ఆరెండు పువ్వులూ మీకు విడివిడిగా యిచ్చే వాళ్ళు! తెలియక మీరు వాసనచూసి విరుచుకు పడేవారు. యీ రహస్యం తెలియక యింట్లోవున్న అయోమయం గొడ్డుని మీరు క్రిందపడివుండటం చూసి కంగారుతో ఆపువ్వులు నేనూ వాసనచూసి పడేవాణ్ణి! ప్రక్కనుంచి యిందు కోసమేకని పెట్టుకుచూస్తుండే వీళ్ళిద్దరూ మిమ్మద్దర్నీ ఒక చోటచేర్చి చల్లగా తప్పుకునేవాళ్ళు! ఆతర్వాత జరగ బోయేది యింక చెప్పేదేముంది. (నిట్టూర్చి) భగవం తుడు మనయందునున్నాడు కాబట్టి సరిపోయింది (క్షణం ఆలోచించి) చిన్నబాబుగారు హాస్పటల్లో

వుంటారు తీసుకొస్తాను వుండమ్మా! (గబగబా బయటకి వెడతాడు)

రా - ఎంత వన్నారు! (గట్టిగా నిట్టూర్చి) రెండుపువ్వులూ తీసుకొని లోపలకు వెడుతుంది-బయటనుండి మరో రెండునిముషాలకు దామోదరం చలమయ్యలు వస్తారు. మిస్టర్ చిమ్‌ఛిమ్ సుధల్నిచూసి ఒక్కసారిగా ఆఁ! అంటారు)

దా - [స్థాయిగా] రాధా! రాధా!! [రాధ లోపలనుంచి వస్తుంది] ఏమిటిది? ఎందుకు వీళ్ళిలా వడిపోయారు?

రా - మైకంనుండి తేరుకున్నాక వాళ్ళను అడిగితేనే తెలుస్తుంది.

చ - అంటే?

మ - [బయటనుండి వస్తూనే] నేనుచెప్తాను. [రాధను చూస్తూ] ఆపువ్వులు యెవ్వి? [రాధ లోపలకు వెడుతుంది]

దా - వువ్వులా? [అర్ధంకానట్లు చలమయ్యను చూస్తాడు]

చ - తీసుకురానియ్ చూద్దాం! [రాధ పువ్వులు తెచ్చి మధుకి యిస్తుంది]

మ - యిందులో జోడించిన మత్తుమందు యేరకమైనదో పరీక్షచేసి చెప్తాను. ముందీ ప్రతీకార వాంఛావరుల్ని ఆవేశించిన మైకం వదలకొట్టి నిజంచెప్పిస్తాను. [వాళ్ళ

చేతులు పట్టుగు పరీక్షించి రాధనుచూస్తూ] నీళ్ళు పట్టుగురా [రాధ లోపలకు వెడుతుంది యింజక్షన్ సూది సరిచేసుకొని సుధ, చిమ్‌చిమ్‌లకు యింజక్షన్ యిస్తాడు ఆవెంటనే రాధ తెచ్చిననీళ్ళు వాళ్ళ మొహాన చల్లుతాడు. దామోదరం చలమయ్యలు చిత్రంగా చూస్తూంటారు]

దా – అసలు వీళ్ళు యిక్కడ కెందుకొచ్చినట్లు?

రా – మానాభి మానాలు లేనివాళ్ళు......

మ – ఎందుకన్నా సిద్ధపడతారు. [సుధ మిస్టర్ చిమ్‌చిమ్‌లకు స్పృహవస్తుంది కంగారుగా లేస్తారు] మనిషైపుట్టిన తర్వాత మానాభి మానాలు వుండాలి ధూ! బ్రతుకు బ్రతగ్గానేసరా నెత్తురూ చీములేని బ్రతుకు [స్త్రాయి పెంచి] ఫో బయటకి! (చలమయ్య పళ్ళుకొరుకుతూ వుద్రేకం తెచ్చుకుంటాడు. వళ్ళుతిగ్గి వూగుకుంటాడు) ఏరా చిమ్‌చిమ్! (సుధ బయటకి వెడుతుంది) ఎందుకురా యీ వెధవపనికి వచ్చావున్నావ్? నిజంచెప్తావా కేసుపెట్టి అరష్టు చేయించమన్నావా?

కు – (భయం, కంగారుతో) చెప్తాను చెప్తాను. కరక్టు!

మ – రావద్దని చెప్పాక ఎందుకొచ్చావ్?

మిస్ట – సుధ తీసుగొచ్చింది.

దా – ఎందునిమిత్తం?

ఐంస్ట - ఆపువ్వుల్లో ఒకదానిలో మత్తుమందు పెట్టింది! అది రాధకుయిస్తే రాధ వాసనచూస్తుంది శరభయ్యవచ్చి రాధ పడిపోయిందన్న కంగారుతో వాసనచూస్తాడు. వాడూ పడిపోతాడు ఆయిద్దర్నీ ఒకచోటచేర్చి వాళ్ళ యిద్దరికీ సంబంధంవున్నట్లు సృష్టించాలని అనుకున్నాం యింతే కరక్టు.

చ - బుద్ధిలేకపోతేసరి! యిప్పుడే వెళ్ళివాన్ని నరికి పోగులు పెడ్తాను (గబగబా బయటకు వెడతాడు)

దా - బుద్ధులు మారినా యనుకున్నాను. కడుపులో యింతంత కల్మసాలు పెంచుకున్న వాళ్ళతో జో స్త్రీ యెప్పటికైనా ప్రాణసంకటమే.

మ - అని యిప్పటికి గ్రహించారా ముందు యీపువ్వుల్లో జోడించిన మత్తుమందు ఫలానని నిర్ణయించటం అవసరం (పువ్వులు పట్టుగు బయటకు వెడతాడు)

దా - (రాధనుచూస్తూ) అయితే నాకొక అనుమానంగావుంది నీకు వాసన చూపాలని తెచ్చిన మత్తుమందు పువ్వు వాళ్ళే ఎలావాసనచూశారు.

నా - వాళ్ళరహస్యం శరభయ్య పసికట్టి నాతో చెప్పాడు నేను తెలివిగా ప్రవర్తించి ఆపువ్వు వాళ్ళే వాసన చూసేలా చేశాను.

దా - మంచిపనిచేశావ్! చక్కగా బుద్ధిచెప్పావ్. [పడక కుర్చీలో కూర్చుంటాడు రాధ లోపలకు వెడుతుంది.

బయటనుండి యేదో పొట్లం పట్టుకు ప్రకాశం వస్తాడు]
ప్రకాశం.

ప్ర - వున్నారా బాబుగారూ! వుంటారో వుండరోనన్న అనుమానంతో వచ్చాను

దా - ఏమిటివని?

ప్ర - వడ్డీతోసహా మీకు యివ్వాల్సిన వెయ్యిరూపాయలూ తెచ్చాను. నావస్తువులు నాకుయిప్పిస్తారా? [ప్రశ్నగా చూస్తాడు]

దా - [ఎటూతోచక తెల్లబోయి చూస్తాడు]

ప్ర - అదేమిటండీ అలాచూస్తారు? తాకట్టుపెట్టిన వస్తువులు యిప్పించండి.

దా - [అలాగేచూస్తాడు]

ప్ర - [అర్థంకానట్లు] అయ్యో! మిమ్మల్నేనండి ఏమిటి సందేహం?

దా - సందేహమేముంది? సర్వం తుడిచిపెట్టుకు పోయాయ్.

ప్ర - అంటే వెళ్ళిపోతానని అనుకోకండి. తాకట్టువస్తువులు యెగెయ్యాలని అప్పుడేవేశారుఎత్తు మీరూ చలమయ్యాను అవ్వేం లాభంలేదు యివ్వండి యివ్వండి [కూర్చుంటాడు]

దా - నామాటలునమ్ము ప్రకాశం! నేను చెప్పేది యదార్థమే

ప్ర - అయితే యేమంటావు? వస్తువులకి ఆశపడుతున్నాననా మీరు చెప్పేది? కుదరదు! నేనసలే కోపదారి మనిషిని నావస్తువులు నాకిచ్చి తీరాలి.

దా - ఎక్కణ్ణుంచి తెమ్మంటావ్?

ప్ర - ఇనప్పెట్టెలోనుంచి-

దా - ఏముంది యినప్పెట్టెలో నాబొంద! అరలన్నీ ఖాళీ పెట్టె చూస్తే కడుపు తరుక్కుపోతోంది.

ప్ర - మీసంగతి నాకు చెప్తారా? [నవ్వి] దొంగలెత్తుపోయా రంటే తీరిపోతుందనుకున్నారా?

దా - లేదు ప్రకాశం! ప్రమాణపూర్తిగా చెప్తున్నాను.

ప్ర - నేనూ చెప్తాను లక్షప్రమాణాలు! జరిగేవా చచ్చేవా? దొంగలెత్తుగెళ్ళారట దొంగలు హుఁ! (హేళనగా) ఆబద్ధమాడిన అతికే టట్టుండాలి? మీకు తెలియకుండా యినప్పెట్టెలో వస్తువులు యేమవుతాయో!

దా - వేసిన తాళాలు వేసినట్టున్నాయ్.

ప్ర - (వెటకారంగా) పెట్టెలో వస్తువులు పెట్టెలోనే మాయ మయినాయ్! (చిన్నగానవ్వి) యెవరితోనన్నా చెప్తే నవ్వు తారు. నావస్తువులే పోయినాయా? గుర్తు తెచ్చుకోండి. తాళాలు ఎవరికన్నా యిచ్చారేమో

దా - యెవ్వరికీ యివ్వలేదు.

ప్ర - యిది మరీచిత్రంగా వుంది! (పేలవగా) తాళాలు యెవరికీ యివ్వలేదు నగలు, నగదూ మొత్తం మాయమయ్యాయ్! (.వ్వి) యివన్నిట్టి మింగేసిందేమో... మీకు యెవరిమీదన్నా అనుమానంవుంటే వాళ్ళ మీద పోలీసు రిపోర్టు యివ్వండి.

దా - పోయినవి పోగా ఆ అప్రదిష్టకూడా యెందుకు? అయినా నారాయణ పోలీసురిపోర్టు యివ్వటానికి వెళ్ళనే వెళ్ళాడుట

ప్ర - మీ అబ్బాయిగాని, రాధమ్మగాని తీశారేమో అడిగారా? (ప్రక్కగా చూస్తాడు)

దా - వాళ్ళయింట్లో వాళ్ళు దొంగతనం చేసుకుంటారా? యీపని బయటవాళ్ళదే అయివుండాలి!... ప్రకాశం నిన్ను బ్రతిమిలాడు కుంటాను. నన్ను కనికరించి విడిచి పెడ్తూ?

ప్ర - అక్కర్లేం లాభంలేదని యిందాకనే చెప్పాను 'ఆవస్తువులు మేము నోచుకొచ్చినవికావు పాతేపోయాయని వూరుకోటానికి! అన్నీ కిమ్మత్తుకడితే పదివేల రూపాయలకు తక్కువ వుండవు! (మీసం సవరించుకుంటూ) మళ్ళ వస్తాను. మర్యాద కాపాడుకోవాలనుంటే నావస్తువులు నాకివ్వండి! లేదా మీమీద ఆచలమయ్య మీద దావాచేసి పదివేల రూపాయలూ వసూలు చేసేమాట ఖాయమని మర్చిపోకండి! [గబగబా బయటకి వెడ

తాడు. దామోదరం తెల్లబోయి చూస్తూంటాడు. తెరలో నుంచి పాటవినిపిస్తుంది]

[సాకి] ఖర్మదాటవశమా......
నీదారి కానలేవా
ఏదారి నీకు లేదా॥ ॥నీదారి॥

ఎటుచూసినా అంధకారం
కనుపించెనా బ్రతుకు భారం
తెలుసుగోరా యీనిజమూ
కారణ మేమొ నిహాజమూ ॥ఏదారి॥
ఎవరో నినుమించిన దొంగలు
ఎవరో నినుకోరిన దొరలు
గ్రహించరా నిజానిజాలు
పసిగట్టరా ఎవరో వారలు ॥నీదారి॥
యితరుల బోధనవింటే
నా అనువారిని కాదంటే
కలిగేసుఖ మింతేరా
మిగిలేది తుదకు నీవేరా ॥నీదారి॥

[సాకి] చెడుబోధలు చెవికెక్కిన దానికి
కలిగిన సుఖమూ కనుపించెనా
చేసిన పూజల ఫలిత మేమొ
నువు నమ్మినవారల నాటక మేమొ...
ఫలిత మే మొ...నాటక మే మొ... ..

(దామోదరం కంట తడితుడ్చుకుంటాడు బయటనుండి చలపయ్య వస్తాడు)

చ - ఎవరూ లేనట్టున్నారే.

దా - ప్రకాశం డబ్బుకోసం వచ్చాడు.

చ - పెళ్ళి నగలు తెచ్చాడా?

దా - లోగడ పెట్టినవి విడిపించుగోటానికి వచ్చాడు! పోయాయని చెప్పాను. యివ్వకపోతే మనమీద పదివేలకు దావాచేసి మరీ రాబట్టుకుంటానన్నాడు

చ - ఏం చెయ్యాలని నీవుద్దేశం.

దా - నిన్ను సలహా అడుగుతున్నాను

చ - ప్రస్తుతం సలహాలిచ్చే అభిప్రాయంతో రాలేదు.

దా - ఎందుకొచ్చినట్లు?

చ - ఆఖరిసారిగా అడిగిపోవటానికి

దా - ఏమిటది?

చ - సుధను మధుకి చేసుకుంటావా లేదా?

దా - వాడికి యిష్టంలేనప్పుడు నేను చేశేదేమీ లేదు

చ - అంటావని తెలిసే ఆఖరిసారిగా అడిగి మనమధ్య నున్న స్నేహం తెగతెంపులు చేసుకొని నానిర్ణయాన్ని చెప్పిపోదామని వచ్చాను.

దా - చెప్పదల్చుకుందేదో చెప్పొచ్చు (రాధ లోపలనుండి రాబోయి చలమయ్యనుచూసి ప్రక్కకు తప్పుకుం టుంది)

చ - నీఆ స్త్రితాలూకు రహస్యాలన్నీ నీకంటే నాకెక్కువ తెల్సునన్న సంగతి నీకూ తెల్సును.

దా - తెలి స్తే?

చ - మొ త్తం అస్తికిణంలో మాయం చేయగలశక్తి నాలో వుంది

దా - బెదిరిస్తున్నా వా?

చ - బెదిరింపేమీకాదు. సర్వస్వంబుద్ధి పూర్వకంగా నాస్వాధీ నంచేసినట్లు వ్రాయించి తెచ్చిన (జేబులోనుంచి కాగి తాలుతీసి) యీాయగ్రిమెంటుమీద నిన్ను సంతకం చేయ మంటున్నాను.

దా - నిర్బంధిస్తున్నా వా?

చ - వినకపోతే యెలాగూతప్పదు.

దా - యిప్పటికి తెలిసింది నీకుతంత్రం! పడగవిప్పిన పాము వని తెలియక పాలుపోసి పెంచినట్లు, గోచీపాతకు గతి లేని నిన్ను చేరదీసి కాళ్ళుతెచ్చినందుకు...

చ - కళ్లుమూసుకుపోయి సంచరిస్తున్నాను. సరేనా?

దా - ఫలితంగా నాకళ్ళుకూడా తెరిపించావ్. నాబొందిలో ప్రాపిరివుండగా ఆపనిజరగదు ఆతర్వాతనైనా జరగటానికి వీల్లేదు.

చ - అనవసరం! (స్థాయిపెంచి) సంతకం చేస్తావా లేదా?

దా - చేయను! చేయను!! చేయను!!! ముందు నువ్వు బయటకునడు! ఊం.

చ - [నవ్వి] నడవటానికి కాలేను. తలుస్తున్న కార్యం పూర్తి చేయించుకొని నడిపించటానికి వచ్చాను

దా - నీవల్లన అయ్యేపనికాదు

చ - [నవ్వి బయటకుచూస్తూ చప్పట్లు కొడతాడు యిద్దరు కూలీలు వస్తారు] యీాదామోదరాన్ని కాళ్లూచేతులూ విర్చి కట్టి నేను చెప్పిన చోటుకి చాపచుట్టలో తీసుకుపొండి

రా - ఆం! (బయటకు వస్తుంది)

చ - ఏం?

రా - ఏమిటీ ఘోరం.

దా - చేసుకున్నదానికి అనుభవించక తప్పుతుందా! నువ్వు కల్పించుకోకు తల్లీ!

రా - మామయ్యను హింసించటం మీాకు న్యాయమేనా. చలమయ్యగారూ! ఆయన మీామేలు కోరేవారేగదా!

ఎందుకు చెప్పండి మీకీకోపం! మీకాళ్ళు పట్టుకుంటాను ఆయన్ని విడిచిపెట్టండి! (చలమయ్యకాళ్ళు పట్టుకుంటుంది)

చ - ఛో అసలు నీవలనకాదూ యింతవరకూ వచ్చింది? ఛో అవతలకి! (తన్నుతాడు రాధ వెనక్కి పడుతుంది) ఊఁ! (కూలీలను చూస్తాడు. కూలీలు దామోదరంమీద చెయి చేసుకోబోతారు. మధు ప్రకాశం పోలయ్య బయటనుండి వస్తారు) ఆఁ!

మధు - (చలమయ్య చొక్కా పట్టుకొని) ఏమిటిది?

చ - (మధు చంపమీదకొట్టి వెనక్కి తోసి) నీదిక్కున్నచోట చెప్పుకో

ప్ర - (వెనకనుండి చలమయ్యను తనవేపుకి తిప్పుకొని గట్టిగా కొడతాడు) యిప్పుడు నువ్వు చెప్పుకో నీబాబుకి (మధు సహాయపడ్తాడు ప్రకాశం చలమయ్యను కదలకుండా పట్టుగు కట్టేస్తాడు. చలమయ్యతో వచ్చిన కూలీలు పారిపోబోతారు. అదే సమయంలో బయటనుంచి వచ్చిన శరభయ్య అక్కడేవున్న పోలయ్య వాళ్ళ చేతులు విర్చి కడతారు)

చ - (అందర్నీ ఆదోలా చూస్తాడు)

దా - మనింట్లోకూడా ఎందుకావిశ్వాస ఘాతకుడు? తన్ని తరిమెయ్యక!

ప్ర - (పోలయ్యను చూస్తూ) ఏదిరా మాట! (అందుకొని) జరిగినకథ నేను చెప్తాను వినండి! మీయింట్లో యిన ప్పెట్టెలో పోయిన నగలు, నగదు, కాగితాలూ అన్నీ యిందులో వున్నాయ్! తీసుకోండి మధుబాబూ! (అం దిస్తాడు. మధు రాధకు యిస్తాడు)

దా - అవి నీకెలావచ్చాయ్?

ప్ర - దారికొడితే?

దా - అంటె?

ప్ర - మీరు స్వబుద్ధితో తాళాలు యెవరికీ యివ్వలేదన్నా రుగా

దా - అవును.

మధు - డూప్లికేటు తాళాలు ఆచలమయ్య దగ్గర వున్నాయ్

దా - ఎక్కడివి? (ఆశ్చర్యంగా చూస్తాడు)

ప్ర - అది మీయిద్దరికి తెలియాలి అందులో స్నేహితులు [నవ్వి] ఆచలమయ్యగారి అంగీకారంమీద యింటికి వచ్చి పోతూనే నాటిరాత్రి రెండుగంటల ప్రాంతంలో మొత్తం మూటకట్టుకొని ఆ మిస్టర్ బిమ్‌బిమ్ చల మయ్య కూతురు సుధ వెడుతుంటే నేనుచూసి వాళ్ళకు నీడలా వెంటాడాను మొత్తం అన్నీ ఆరాత్రికి రాత్రే చలమయ్య పెట్లో పాతపెట్టి వాళ్లూ వెళ్లారు.

ఆమరుక్షణం వాటిని బయటకుతీసి నేను భద్రంచేశిమీ నగలు మీకిచ్చాను

శ - పోలీసులు చిమ్‌చిమ్‌ను పట్టుకొని చలమయ్య గారింటికి సుధమ్మకోసం వెడుతూండగా నారాయణబాబు మరో పోలీసు జట్టుతో వస్తున్నాడు.

మ - (చలమయ్యను స్మరింపించి) ఎందుకొస్తున్నారో తెలుసా నారాయణతండ్రి వ్రాసిన తనఖాపత్రం క్రిందటిసారి శెలవుల్లో నేను వచ్చినప్పుడే నీబుద్ధిగ్రహించి దాన్ని నేను తీసుకు దాచాను దానికి డూప్లికేట్ తయారు చేసి మానాన్న సంతకం తమరే సాక్షి సంతకంగాచేసి యిల్లు స్వాధీన పర్చుకోటానికి వచ్చారు. యింకేం వసి కట్టాను. ఫోర్జరీకేసు పెట్టాను.

దా - ఎంత ద్రోహం.

ప్ర - ద్రోహానికి ప్రాయశ్చిత్తంగా వచ్చారుగా పోలీసులు చలమయ్య సుధ, మినిష్టర్ చిమ్‌చిమ్‌లు హాయిగా శ్రీకృష్ణ జన్మస్థానానికి వెడతారు వాళ్ళను సాగనం పాకన్నా (దామోదరంను చూస్తూ) తమరు ఆలస్యం చెయ్యకుండా రాధా మధులకు ముడి పెట్టెయ్యండి. (రాధ మధు ఒకరినొకరు చూచుకొని చిన్నగా నవ్వు తారు)

దా - యింకా ఆలశ్యంచేస్తానా? (శగభయ్య చిన్నగా నవ్వు తాడు) ఆమాట యిలాతే అన్నీ వున్నాయో లేదో చూసుకోవాలి. (మూటను సమీపిస్తాడు)

ప్ర - మంచిచేసిన వాళ్ళమీదకూడా అనుమానమేనా? (అందరూ నవ్వుతారు. చలమయ్య తలవంచుకుంటాడు)

మ - నువ్వు చేసిన సహాయానికి చాలా థాంక్స్ ప్రకాశం.

రా - నన్నడుగ్గోకుండానే అసలుసొమ్ముకి నీనగలు నీకిస్తాడు మా మామయ్య!

దా - యిన్నినగలూపోతే యేంచేశేవాణ్ణి? అసలుసొమ్ము కూడా వదలేసి అతనినగలు అతనికి యివ్వడేయిస్తాను

ప్ర - లక్షాధికారి త్యాగమంటే అలావుండాలి. (అందరూ నవ్వుతారు దామోదరం నగలమూట వూడతీయ్య బోతాడు ప్రకాశం బీడీ వెలిగిస్తాడు)

తెర

సమాప్తి